

# ఆనందసామ్రాజ్యము

**(Kingdom of Happiness)**

## జిడ్డు కృష్ణమూర్తి



అనువాదకుఁడు

[illegible] వెంకట సుబ్బారావు

ఎల్లమంచిలి

వసంతా ఇన్‌స్టిట్యూట్ వారిచే ప్రచురితము

1929





# ఆనందసామ్రాజ్యము

**(Kingdom of Happiness)**

## జిడ్డు కృష్ణమూర్తి

అనువాదకుఁడు

గుంటూరు వెంకట సుబ్బారావు

ఎల్లమంచిలి.

వసంతా ఇన్స్టిట్యూట్ వారిచే ప్రచురితము

1929

# అనువాదకుని విజ్ఞప్తి

సోదరులారా!

ఇక్కాలమున నందరును ముఖ్యముగఁ దెలిసికొన వలసిన శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి యుపదేశము లాంగ్లములో నుండుటవలన, వానిని ఆంధ్ర సోదరీ సోదరులకందఁ జేయుటయే, నే నీ గ్రంథమును ఆంధ్రీకరించుటకు కారణము. శ్రీ వారి శైలి యతి సులభమైనను, వారి భావము లతి గంభీరములును, అపురూపములును, అనన్యసామాన్యములును, అగుటవలన, ఆంధ్రీకరణము అతి కష్టమైనది. అయినను, సాహసించి నే నందులకుఁ బూనుకొంటిని. సాధ్యమైనంతవరకు మూలమునందలి భావము చెడకుండ నందరకును బోధపడునట్లు వ్రాయవలెనను నభిప్రాయముతో నే నిందు వ్యాకరణాది నియమములను ఎక్కువగ పాటింపలేదు. ఈ గ్రంథముద్వారా శ్రీ వారి యుపదేశము లాంధ్రలోకమున నొక్కరినైన మార్చినయెడల నేను కృతార్థుడనే.

(అనువాదకుఁడు)

గుం. వెం. సుబ్బారావు

# ఆనందసామ్రాజ్యము

## I

### అంతరంగవాక్కు

నేనిపుడు సాధ్యమైనంతమట్టుకు కొన్ని సంగతులు చెప్పఁదలచుకొన్నాను. ఆ ప్రకారము మీరు కృషిచేయవలయును. కృషిచేసిన యెడల మీ కాధ్యాత్మిక జీవిత తత్త్వములు స్పష్టముగను, విశదముగను, తెలియును. మీరు జీవించియుండ గోరుదురేని, సృష్టిసామర్థ్యము గలిగియుండవలెను. సృష్టి సామర్థ్యముగావలెననిన దృఢప్రయత్నము, అసంతృప్తియు నుండవలెనని మీకు తెలియు ననుకొనెదను. ఇవి ఫలోన్ముఖమగునట్లు చేయుటకు, మీ మీ దృక్పథమును, మీ స్వతంత్రాభిరుచులను, స్వతశ్శక్తులను, వికసింపఁజేసికొనవలయును. అవి వికసింపఁజేసికొనుటకై మీయం దా యంతరంగవాక్కును, మీ నీచ ప్రకృతిని పూర్తిగ లోబరచుకొనువరకు నూరకొనని యాత్మ ప్రవృత్తి స్వరూపుడగు నా శాసకుని, ముందుగ మేల్కొలుపఁబోవుచున్నాను. ఆ వాక్కే స్వతంత్ర సృష్టికార్యమున మీకు యథార్థమైన మార్గదర్శి. ఇతరుల ననుసరించుట యతి సులభమగుటవలన, ననేకు లదియే యుత్తమ మార్గ మనుకొనుచున్నారు. తమ స్వగుణములను పెంపొందించుకొనక, తమ స్వభావములను చక్కబరచుకొనక, తమ యభిరుచులను వృద్ధిచేసికొనక, యితరులను గ్రుడ్డిగా ననుసరించుటయే యతిసులభమని యెంచువారనేకు లున్నారు. స్వతంత్రశక్తుల నభివృద్ధిజేసికొనక, యితరుల ననుసరించుచు బోవుటవలన నా యంతరంగవాక్కు వికసించక నశించు

నని మీరొప్పుకొనుదు రనుకొనెదను. ఆ వాక్కే, ఆ శాసకుడే, ఆ ప్రబోధమే, మనలో ప్రతివానికిని మహోదారుడగు నేతయై యున్నాడు. ఆ వాక్కును వికసింప జేసికొనుటవలన, ఆ వాక్కు నుదారమైనదిగఁ జేసికొనుటవలన, ఆ వాక్కును పరిపూర్ణ మైనదిగఁ జేసికొనుటవలన మన గమ్యస్థానమును—ఎవరి గమ్యస్థానమును వారు —చేరుదుము.

ఆ వాక్కొక్కటియే మనకు శాసకుడును, మన మనుసరించవలసిన నాయకుడు నగువరకును, దానిని వికసింపజేయుటకు గాను, ముందు మన గమ్యస్థానమును దెలిసికొని, దానిని బొందుటకై నిరంతర కృషి సలుపవలయును. ఆ గమ్యస్థానమేది? నేను పరమసత్యమును బొందఁ గోరుచున్నాను. నాకదియే పరమావధి. ఏ యుత్తమావస్థను బొందినపుడు, నేను తరించితి ననియును, నేనే సత్యస్వరూపుడ ననియు, స్వయముగఁ దెలిసికొని, ఏ స్థితియందు ఈ జీవితమును కలతబెట్టు అల్ప పోరాటములు, కల్లోలములు మొదలగు నవన్నియు—స్వతస్సిద్ధముగ నవి విలువగలవైనను—నన్ను కలతబెట్టజాలక, సత్యమును మరుగుపరచఁ జాలక యుండునో, ఆ యుత్తమావస్థను బొందుటయే నా పరమావధి. ఆ పరమసత్యమును బొందినప్పుడే, నా మనోరథమగు శాంతిని—మనస్సు, ఇంద్రియములు పరిపూర్ణ ఉపశమనము నొందియున్న స్థితిని—గూడ నేను బొందుదును. ఇది నా గమ్యస్థానము. మనలో ప్రతివానియందును, అప్పుడప్పు డధికారము చేయుచుండు ఆ వాక్కును బలపరచుకొనుట మన ప్రథమకర్తవ్యమై యున్నది. అంతరంగ ప్రబోధము వికసించుటకును, ఉత్కృష్టత నొందుటకును, సాధనముచేయుటలో మనము స్వతంత్రముగ యోచించి పనిచేయుట యలవరచుకొనవలెను. ఆ యంతరంగవాక్కు వికసించుటయనగా, దాని శాసనముల ననుసరించి మనము ప్రవర్తించుటయే.

ఇతరుల ననుసరించుటవలన సౌందర్యము చేకూరదు. చిత్రకళ యన
గా, ప్రకృతికి సరియైన ప్రతిని వ్రాయుటగాదు. ప్రకృతి లక్షణములను
చిత్రించుటలో ఉదారభావముల వెల్లడించుటయే చిత్రకళ. ప్రతి
వాడును, ఉత్కృష్ట భావదర్శన ప్రాప్తిచే పులకితాంతరంగుడై,
తత్కారణమున స్వతంత్ర సృష్టిజేయగల చిత్రకళాప్రవీణుడై యుండ
వలెను. యథార్థముగ ప్రవీణులును, వన్నె కెక్కిన వారు నగు
చిత్రకళా కోవిదులయందును, బోధకుల యందును పృథక్భావ
ముండదు. సకలభూతములు వారియందును, వారు సకలభూత
ములయందునుఁ జేరియుందురు. సమష్టియందు పరిపూర్ణత గలుగ
వలెననిన, మన మందరము భిన్న భిన్న స్వభావములు గలవారమై
యుండవలెను. ఒక తోటలో నంతటను గులాబిపువ్వులే యున్న
యెడల అది యెంత రమ్యముగ నున్నను, ఒకటే విధముగ నుండుటవలన
చూడఁజూడ విసుగుపుట్టించును; పలురకములు, పలువర్ణములు గల
వైనను, పరిపూర్ణవికాసము నొందిన వైనను, అన్నియు గులాబిపువ్వు
లేయైనయెడల రమణీయతకు లోపము కలుగును. ప్రతివానికి
నితరులవలె కావలెనను చిత్తవృత్తి యుండును. అందరము నొక్కటే
మాదిరి ననుసరించి, యితరులేర్పరచిన యచ్చులలో నమరుటకు తగినట్లు
కాఁగోరుదుము. అంతరంగ ప్రబోధవికాసమున కీ కోర్కె యాటంక
మగును. అయితే, మన మందరము నా యానంద సామ్రాజ్యమున
గలిసికొందుమని మరువవద్దు.

జనాంగధర్మములలోనైతే నేమి, పూజావిధానములలోనైతే నేమి,
మనకును ఇతరులకును భేదములున్నవని తలచుట మన స్వభావమై
యున్నది.

ప్రపంచము మనకు వెలుపలనున్నదని తలచి, పృథక్భావము మన
మలవరచుకొనుచున్నాము. మనకట్టి సంకుచిత దృష్టియు, నల్పభావ

ములు నున్నయెడల, మనము నిర్మించుటకు బదులు నాశనమొనర్తుము. మీ రనుగమించఁదలచుకొన్న మార్గమున, మీ జీవిత మార్గమున, మీరు నిర్మించుకొన్న మార్గమున, మిమ్ము నడిపించగల యీ వాక్కును సాధ్యమైన యెడల, మీయందు మేల్కొల్ప కోరుచున్నాను. ఆ వాక్కును, ఆ యంతరంగప్రబోధమును, అనుసరించి యున్నంతకాలమును, మీరు తప్పు చేయఁజాలరు. అటుగాక, మీరితరుల యాజ్ఞలను, భావములను, మనోరథములను, అనుసరింపఁ బోవునపుడే తప్పులఁ జేయుదురు. నా కాదర్శమగు సత్యమును, పరిపూర్ణశాంతియును, ప్రేమ పూరితమగు దయయును, నేను మీకు చూపగలను, గాని, యా పరమావధిని మీరు పొందవలెనని, నందుకై మీరే ప్రయత్నము చేయవలెను. దానిని మీరే పొందవలెను. సత్యతత్త్వమును నేను నిరూపించిచూపఁగలను, గాని, మీ స్వంత వాక్కు ననుసరించుటవలన మీ యంతరంగ ప్రబోధమును, మీ మనోభావములను మీరే వికసింపఁజేసికొనవలెను. అప్పుడే మనమందరమును కలిసికొనవలసిన గమ్యస్థానమును మీరు చేరగలరు.

నా జీవితములో నెల్ల నిదియే మహద్విషయము. ఒకరు పోవు మార్గము సరియైనదని నాకు కనఁబడిననేకాని, వారెవ్వరైనను సరే, వారి ననుసరించుటకు నే నంగీకరించను. సత్యమును మరుగుపరచు తెరచాటున దాగియుండుట నాకిష్టములేదు. నా మనస్సున కంగీకారములు కానట్టియు, నా యాత్మను, నా హృదయమును, నా సర్వసత్వమును సమర్పించుట కర్హత లేనట్టియు, నమ్మకములు నా కక్కరలేదు. సామాన్యులుగను, మధ్యమ రకముగను ఉండక, మీ యంతరంగవాక్కును విని, మీ యంతరంగ ప్రబోధమును వికసింపఁజేసికొని, యితరులు బోవు త్రోవనే గ్రుడ్డిగా గొట్టుకొనిపోక, నూతన జీవితమార్గములను కనిపెట్టుడు.

ఈ పరమావధిని బొందుట కంతరంగ ప్రబోధమును వికసింపజేసికొనవలయునని చెప్పియున్నాను. అంతరంగప్రబోధము, అంతరాత్మ

యొక్క వాక్కు, ప్రకాశించవలెనన మన మనస్సును, హృదయమును, పరిపూర్ణమగు సామరస్యము నొందవలెను. అంతరంగప్రబోధము పరమాత్మయొక్క యేకాంత ధ్వని, మనకు జీవితమార్గమును గనపరచు పలుకు. బలమైన హృదయరాగములను, తీక్ష్ణములయిన తలంపులను, ఎంత పరిశుద్ధిజేసి, సంస్కరింతుమో, అంతయెక్కువగ మన కా వాక్కు వినఁబడును. ఆ వాక్కు అందరకును సామాన్యమైన యంతరంగ ప్రబోధము; ప్రత్యేక మొక్క వ్యక్తికి మాత్రముగాక మానవకోటి కంతకును చేరిన యంతరంగ ప్రబోధము. మనహృదయ రాగములు, ప్రేమసంబంధములైనను, గాఢమగు నానందసంబంధములైనను, యథార్థమగు దయా సంబంధములైనను, బలమైనవిగ నుండవలెను. రాగరహితుడెందులకును పనికిరాడు, కాని బలమైన హృదయరాగములు గలవాడు, అవి చెడ్డవైనను, వానిని సంస్కరించుకొని, నాణ్యమైనవిగ జేసికొనఁ గలడు. కఠినునకును, ఉదాసీనునకును, సృష్టించుటకుగాని, నశింపజేయుటకుగాని, నిర్మించుటకుగాని, శక్తియుండదు. గొప్పవినాశకుడెన్నడు నల్పుడైయుండడు. వానియం దేదోయొక యద్భుతమైన విశేషముండును. అట్లే విశేషముగ ప్రేమించువాడు గూడ, సామాన్యుడుగాని, యల్పుడుగాని కాఁజాలడు. హృదయరాగములెంత బలముగనున్న నంత మంచిది. అయితే, వానిని బలపరచుకొనుటయే గాక, లోఁబరచుకొనుటగూడ నభ్యసింపవలెను. అవి కలుపుమొక్కల వంటివి. ఎప్పటికప్పుడు వాని నెదుగకుండఁ దీసివేయనియెడల నవి మీతోటను పాడుచేయును. ఈ రాగములు బలహీనములైన యెడల, ప్రతిదినమును వానిని పోషించుచున్నంత మాత్రమున నవి బలపడి, వృద్ధినొందును. మనకు రాగభావములు బొత్తిగా నుండరాదనుట తప్పు; అట్టి యభిప్రాయము పరమార్థ విరుద్ధము. మన యందవి యెంతతీవ్రముగ పొంగుచుండునో, అంత మేలు. అయితే యవి మన స్వాధీనములో

నుండవలెను, లేనియెడల కీడు వాటిల్లును. వానిని లోఁబరచుకొనకున్న యెడల, మన మంతరంగప్రబోధమునకు దూరమై, గమ్యస్థానమునకు బోవు రాజమార్గమును వీడి, సందుగొందులనుబట్టి దారి గానక తిరుగుచుందుము. గురుతరములగు భావములను కలిగియుండుడు. వానిని లోఁబరచుకొని, వానితో నాటలాడుడు.

ఏపనిని జేయకుండఁగూర్చొనక, లేచి యేదోయొకపనిని, యొక సాహస కార్యమును కనిపెట్టి చేయుచుండుడు. మన మందరము నొక్కటే మాదిరిగ కాఁగోరుచున్నాము. అందువలన నేనీవిషయమయి యింత తీవ్రముగ భావించుచున్నాను. మన మందరము నొక్కటే విధముగ నాలోచించుటకు, ఒక్కనియందనే జేరుటకు, కోరుచున్నాము. మన మేదోయొక సంస్థలోఁ జేరనియెడల, నభివృద్ధినొంద మేమో యని భయపడుదుము. అభివృద్ధియన నేమి? అది మీ స్వకీయమగు ఆనందము— అభివృద్ధియనునది కేవల మొక మాట. ఈ లోకములో అల్పతృప్తినిఁ గలుగజేయు విషయములన్నిటిని అనుభవించుటకంటె నానందముగనుండుటకే నే నెక్కువగఁగోరుదును. నీకు నిజమైన యానందము కలిగి, నీ పరమావధి నీ దృష్టిలో స్పష్టముగను, నిర్మలముగను నిలుపుకొని యున్నయెడల, నీ వే మతస్థుడవైన నేమి? నీ కే గౌరవమర్యాదలున్న నేమి? ఒక్కక్షణము, బుద్ధదేవుని, ఆయన శిష్యులను తలచుకొనుడు. ఆ శిష్యులు వారికాల లక్షణముల కతీతులు. వారందరకును బుద్ధదేవుడొక్కడే పరమగురువు, ఒక్కడే పరమావధి, ఒక్కడే యాదర్శము. అయినను, వారొక్కొక్కరియందును మేధాశక్తి మెఱయుచుండెను. వారు, ఆ యనన్యసామాన్యుని, మానవకోటి పుష్పించిన యా పుష్పరాజమును, అనుసరించిరి, గనుక, వారు సామాన్యులుగారు. మనమును వారివలె లోకమున కాదర్శమూర్తులము గావలెను.

# II

## శ్రద్ధ: ఉత్సాహము

మనము జీవితమును గురించి శ్రద్ధ వహించుట యెంత యావశ్యకమో మీమనస్సులలో నాటునట్లు తెలియజేయఁ బోవుచున్నాను. శ్రద్ధ లేనియెడల నే పనియుఁ జేయజాలము. మీకు గాఢమగు శ్రద్ధ యుండవలెను. నా కీచుట్టుప్రక్కల నుండు సమస్త ప్రాణులును జ్ఞానదాయకము లగుటవలన వాని యన్నిటియందును నాకు శ్రద్ధగలదు. సత్యమును, ఆనందమును, శాంతిని, ప్రసన్నతను, పొందుటకంటె వేరొక జీవితోద్దేశము నాకు లేదు.

యథార్థమగు శ్రద్ధ కలుగవలెననిన, మీ మనస్సులును, మీ భావములును, నిరంతరము వీర్యవంతములుగ నుండి, పనిచేయుచుండవలెను గాని, నిద్రించుచుండునవిగ నుండరాదు. మీకు శ్రద్ధఁగలుగఁజేయుటకై సాధ్యమైనయెడల, నా శ్రద్ధలో గొంత మీకు పంచిపెట్ట గలిగినచో బాగుగ నుండునని తోచుచున్నది. ఏలయన, మీ కా శ్రద్ధ లేనియెడల, తెలిసికొనవలెనను కాంక్ష, గమ్యస్థానమును పొందవలెనను నభిలాష, పరవస్తువును బొందుటకై యితరముల నన్నిటిని సరకు చేయని కుతూహలము, మీకు లేనియెడల, మీ కాత్మత్యాగము జేయుట వీలుగాదు. వాస్తవమగు వికాసము గలిగినంగాని మీ కా శ్రద్ధ గలుగదు. నూతనముగ మానవత్వమును బొందిన యజ్ఞానుడగు ననాగరికునకు లోకములో బ్రతివస్తువు క్రొత్తగఁ గనబడును; వాడు కర్మమును బ్రోగుచేసికొనుచున్నాడు; కష్టముల ననుభవించుట నేర్చుకొనుచున్నాడు; స్వతంత్రముగ సంకల్పించి పనిజేయ నారంభించు

చున్నాడు. అట్టివానికి జీవితములో నొక్కటే విశమైన క్షుద్రమగు శ్రద్ధ యుండును. వానికి నైహిక విషయముల నన్నిటిని సేకరించుట, అనుభవించుట, సుఖపడుట యనునదియొక్కటే యుద్దేశము. నాగరికుడును, రసజ్ఞుడు నగువాడు, అనేక జన్మములలోఁ గలిగిన పరిపాకము వలనను, పూర్వజన్మ కర్మవలనను, జ్ఞానమును, అనుభవమును, అంతరంగ విజ్ఞానమును, వివేచనాశక్తిని సంపాదించుకొనును. వాడెల్లపుడు నముఖ్యములయిన విషయములను విసర్జించును. వానికి సత్యాన్వేషణమునందభిరుచి గలుగుటకదియే మార్గము.

క్రొత్తగా జీవిత సుఖములను, అనుభవములను, రుచిచూచుటకుఁ బ్రారంభించిన యనాగరికునకు శ్రద్ధ యెంత యుద్రేక కరమయినదిగను, యెంత నావశ్యక మయినదిగను ఉండునో, మనకుగూడ నది యంత యుద్రేకకరముగను, ఆవశ్యకముగను ఉండవలెను. అయితే, అనాగరికున కీ స్థూలలోకమున నిత్యము సంభవించు విషయములే శ్రద్ధాపాత్రములై, వానియందే వాని మనస్సంతయు లగ్నమైయుండును. మన మా యవస్థను మీరియున్నాము. మనము నూతనమార్గము లవలంబించి యున్నాము. మనకుఁ గ్రొత్తకోరికలు పుట్టుచున్నవి. మనము కర్మ విముక్తికై ప్రయత్నించుచుండవలసిన యీ కాలమున అనాగరికుఁ డింకను కర్మమునుఁ బ్రోవుజేసికొనుచున్నాడు. మనమా సర్వ నియంత యగు నంతర్వాక్కు ననుసరించఁగలుగునట్లు మన యిచ్ఛాశక్తిని బలపరచుకొని, మన కాంక్షలను నియమించుకొను చుండవలెను. మనకు నిరంతర మార్గదర్శియగు వాక్కును వినుటకును, విని యనుసరించుటకును, ఉత్సాహ మొక్కటే సాధనము. ఈ యుత్సాహము మీకున్నయెడల, మనము వినుట కాతురపడుచున్న యా వాక్కు, ఆ యంతరంగ విజ్ఞానము మీకు గురువును, మీ జీవితములలో నెల్లనేకమగు ప్రమాణము నగును.

ఈ శ్రద్ధ గలుగవలెననిన, గమనించుటకును, యోచించుటకును, ఊహించుటకును, సాధారణపు అనుభవముల నన్నిటిని స్వయముగ ననుభవించకయే వానియందలి కష్టసుఖములను గ్రహించుటకును, మీరు తెలిసికొనవలయును. ఇందుల కొక దృష్టాంతము నిచ్చెదను. ఒక నాడు, నా సోదరునితోఁగూడ నేను షికారునకుఁ బోవుచున్నట్లూహించితిని. మే మొక సన్నని త్రోవలోఁ బోవుచుంటిమి. మేము నడచుచున్నంత సేపును నా సోదరుని నీడకంటె నా నీడ యెక్కువ గాఢమైనదని నాకు తోచుచుండెను. అది యేలయని కొంతసే పాలోచించితిని. నా మనస్సంతయు నాసోదరునియందు కంటె నాయందే యెక్కువ గాఢముగ నిలిచియుండెనని తెలిసికొంటిని. నేను రెండద్దములలో నుంచి చూచుచున్నట్లుండెను. అందులో నొకటి రెండవదానికంటె గాఢతరముగ కప్పుగలిగి యుండెను. గాఢమైన కప్పుగలిగినది నేను. రెండు నీడలు నొక్కతీరున నుండవలెనని కోరితిని. కొంతసేపటి కా భేదము పోయి, నేను, నా శరీరములు నా సోదరునితో నేకీభవింపఁ గలిగితిని. పిమ్మట నేనొక తోటలోపండుకొని—ఇదంతయు నూహయే సుడీ!—యొక గడ్డిపోచను జూచుచుంటిని. గడ్డి మొలచునపుడు, ముందొక దృఢమయిన యొరలోనున్నట్లు బయలుదేరి, తరువాత నది రెండు మూడు రేకులుగా చీలునుగదా! రేకులుగాఁజీలని గడ్డిపోచవలె నేను భావించుకొంటిని. ఆ పోచ భూమిని చీల్చుకొని బయటకు త్రోసికొని వచ్చుటయును, దానిలో రసము క్రిందినుండి పైకెక్కుటయును, రేకులు వీడుటయును, క్రమముగ ననుభవించి, తుదకా రేకులలో బ్రతిరేకును నే నే నైతిని. నా యూహాప్రపంచము నుండి మరలివచ్చి యిట్లను కొంటిని: "పృథక్భావమును తరించిన ట్లనుభవము గలుగుటకంటె నీ జీవితములో నా కింకేమికావలెను? ఆ యనుభవమువలన 'అహం' అను భావమును మరచి, యితర ప్ర

పంచముతో—వృక్షములు, జంతువులు, మనుష్యులు, సమస్తప్రాణుల తో—నైక్యము నొందుదునుగదా? అప్పుడు నేను సత్యమునకును, పరిపూర్ణత్వమునకును సమీపముగ నుందునుగదా!" ఈ భిన్నాత్మయే, యీ యాత్మ సంకుచితమే, స్వయముగ గల్పించుకొనిన యీ వేరు భావమే, మన యభ్యుదయమున కాటంకమగును.

నే నిదివరకు చెప్పినట్లు, సంకల్పశక్తియును, శ్రద్ధయును గావలసిన యెడల, మనస్సు జాగరూకతతో నుండవలెను; మీరొకరి నొకరు గమనించిచూచుచు, నొక్కొక్కరినుండి తెలిసికొనదగిన విషయ ములను తక్కినవారు తెలిసికొనుచుండవలెను. మీయందు శ్రద్ధ యుదయించువరకును, మీ యుత్సాహ మస్పష్టముగను బలహీనముగను నుండక స్పష్టముగను స్ఫుటముగను నగువరకును, మేధాశక్తియనుజ్యోతి మీలో బ్రకాశించువరకును, మీరు ప్రయత్నముజేయుచునే యుండవలెను. మేధావి యనగా తన గమ్యస్థాన మేదో తెలిసికొని, తన యుత్సాహము నెప్పుడును వీర్యవంతముగ నుంచుకొని, ఆ గమ్యస్థానమును గూర్చి స్థైర్యముతో బోవుచు, ఆ దివ్యదర్శన మెప్పుడును మనస్సులో స్పష్టముగ నుంచుకొనుటకై ప్రయత్నించుచు నుండువాడని నా యభిప్రాయము. కుటుంబ కష్టములు, ప్రాపంచిక దుఃఖములు మొదలగు నల్పవిషయములలో నిమగ్నుడుగాక, నిరంతరమును, వాని నొక ప్రక్కకు ద్రోసివైచి, యాదర్శనమునే నిర్మలముగను, స్పష్టముగను, తనయెదుట నుంచుకొనువాడే మేధావి. సాధారణ సంసారి, కేవల లౌకికుడు లోకవ్యవహారములచే నణగద్రొక్కబడి, దివ్యదర్శన లాభమును పొందక, తన పరిస్థితులకు లొంగిపోయి, జీవితముపై స్వాధీనము తప్పి, యూగులాడుచుండును.

మన గమ్యస్థానమును జేరుటకు బ్రయత్నించుటలో, ప్రాపంచిక కష్టములను మరచిపోయి, మనలనెల్లప్పుడును ముందుకు ద్రోయునట్టియు

మనోబలమును, నైతికశక్తిని, సమకూర్చునట్టియు, శ్రద్ధను సంపాదించ వలయును. మీరు స్వతంత్రముగ సంకల్పించి, సృష్టించి, లోకహితముఁ జేయఁగోరుదురేని, మీ రా దివ్యదర్శనమునుఁ బొంది, మీ రా దర్శనముతో పూర్తిగా నిండియుండవలయును; మీ జీవితమంతయు నా దర్శనముతో నిండి, మీ రందులో నొక యంశయై, యది మీ సొంతమై, సత్యమును మీరు స్వయముగ దెలిసికొనినపుడే, మీ రా సత్యము నితరుల కందింపఁగలరు. ఇది మీకు కర్తవ్యము. ఇది మీకు కలుగవలసిన కాంక్ష. అయితే ఈ కార్యమునకు ఈ కాంక్షకు ఫలము, జీవితైక ప్రధానమగు నా దివ్యదర్శనము నితరులకుఁగూడ లభింపఁజేయుటయే గాని, యెవరిమట్టుకు వారు దేవతలై స్వప్రయోజనపరు లగుటకాదు.

పరమగురు వందరికొరకు నున్నాడు. ఆయన లోకప్రియుడు. ఆయన తన దివ్యజ్ఞానమును, ప్రేమను, కొంతమందికి మాత్రము లభించిన దృప్తినొందరు. ఆయన యందరికొరకు నవతరించుచున్నారు. ఆయన యందరి జీవితములయందును సౌందర్యమును, సుఖమును, గలుగజేయఁ బోవుచున్నారు. ఆయన చిత్తవృత్తి యట్టిదని తెలిసినవారు, ఇతరుల కియ్యదగిన దించుకయైనఁ గలవారు, ప్రయత్నము జేసినవారు, తమలో జ్ఞానజ్యోతిని వెలిగించుకొన్నవారు, ఎంత యెక్కువమంది యున్ననంత యెక్కువగ మన మాయన యుపదేశములను బోధపరచికొని, వాటి ననుసరించి, పరోపకారముఁ జేయగలము.

బుద్ధదేవుని గురించియును, ఆయన శిష్యులను గురించియును ప్రస్తావించియుంటిని. ఆ శిష్యులు సామాన్యులై యుండియుండరు. పర్వత శిఖరముపై నడవులలో బోవుచు, బడలి విశ్రమించుటకు నీడనుగోరు బాటసారులను శుద్ధమైన ప్రేమతో నాదరించి, వారికి నీడనొసంగు వృక్షరాజములవలె నా శిష్యు లనన్యసామాన్యులయి యుండిరి. వారా గురుదేవుని తత్త్వమును గ్రహించి, ఆయనచే పవిత్రము చేయ

బడిన వాయువును పీల్చి, ఆయనయొక్క తేజస్సులోనే వసించియుం డుటవలన, ఆయనయొక్క దివ్యశోభలోఁ గొంతభాగము నీ లోక మున కొసంగఁ జాలరి. మనముగూడ వారివలెనే, పర్వతశిఖరములపై వృక్షరాజములపై యుండవలెనుగాని, బయళ్లలో బెరుగు సాధారణము లగు పొదలుగ నుండరాదు. అట్టి పొదలు నేనవేలున్నవి. అయితే, పొదలుగఁగూడ నుండవలయును. ఏలయన, మొట్టమొదటనే చిన్నలత గానో, యే పనికిమాలిన మొలకగానో యుండుట వలన నేమో యెరుగ కుంపే వృక్షరాజముగ నుండఁజాలము.

జీవితము నెడల శ్రద్ధదీసికొనవలెనని చెప్పుటలో నా యభిప్రాయ మేమన, దినములో ప్రతినిమిషమును మనము మెలకువతో నుండవలెను. నిన్న నేను బైబిలు చదువుచుంటిని. అందులో "కుమారా! దేవుని కొలుచుటకు నీవు వత్తువేని, వివిధాకర్షణములకు నీ యాత్మను సిద్ధ పరచుకొని రమ్ము" అను వాక్యమునుఁ జదివితిని. నీ యాత్మ, నీ శరీ రము, నీ సర్వమును, సరియైన యాకర్షణములకు సిద్ధముగ నుండవలెను. దానివలన నుపకారము జేయుట కుత్సాహము గలుగును. అందుకే నీవు రసజ్ఞుడవై యుండవలెను. నిజమయిన ప్రచండుడు అరసికుడును, కురూపియునై యుండునని నే నూహింపఁజాలను. ప్రచండు డనగా నుదారభావములు, నుదారమనస్సును గలవాడుగాని, కేవలము దీర్ఘ కాయుడని నా భావముగాదు.

ఈ విజ్ఞాన సంపదయు, శ్రద్ధయు, నుత్సాహమును గలిగినప్పుడే యా యంతరంగ వాక్కును—దాని సుస్వరములను, దాని యధికార పూరితములగు నాజ్ఞలను—వినగలవు. అందువలననే, భౌతిక జీవిత మునకు సంబంధించిన సౌందర్యము, శుచి, సుఖస్థితులను గురించి, శ్రద్ధ వహించుట యావశ్యకమైనను, మనస్సును హృదయమును సంస్కరించుట దానికంటె నెక్కువ ముఖ్యమని నే నెప్పుడును, హెచ్చరించుచుందును.

నీ వెంత సుందరమైన దుస్తులను ధరించినను, నీ మనస్సును, హృదయమును, మోటుగా నున్నయెడల, నీకా వాక్కు వినిపించదు. అయితే, చక్కని దుస్తులు, ఇంపుగాను, సొగసుగాను కనబడునట్లు ధరించుట తప్పు అని నేను చెప్పను; కాని మనస్సును, హృదయమును సంస్కరించుకొని, సరళముగ జేసికొనుట యొక ముఖ్యమైనసంగతి. ఇది యుదారత. దీనికంటె వాంఛనీయమును, సంతుష్టికరమును, ఉత్సాహకరమును, అగునదీలోకములో మఱియొకటి లేదు. ఈ యుదారతనే యాత్మ నిరంతరము కాక్షించుచుండును. దానిని పొందుటకు తగిన శ్రద్ధ మీకు కలుగజేయగలుగుదును గాక! మీరు పాఠశాలలలోగాని, యుపన్యాస వేదికలపైనగాని, సాధారణ వ్యాపారములలోగాని, యెచ్చటనున్నను, మీకా చిత్తవృత్తి యున్నయెడల, ఆవాక్కును వినగోరు శ్రవణేంద్రియ మున్నయెడల, మీ రెవరైనను, ఏజాతివారైనను, ఏరకమువారైనను, ఏ స్వభావము గలవారైనను, ఏ మతస్థులైనను, ఒక్కటే. ఇంతకును, ఈ భేదములును, ఈ విభాగములును, అస్థిరలోక సంబంధమైనవి. నేను స్వతంత్రుడను, సుఖుడను, ఋజువర్తనుడనై యున్నంతవరకు, నే నెవ్వడనో యితరులు నాకు చెప్పనక్కరలేదు. నాకా విషయమై యితరుల ప్రమాణ మక్కరలేదు. ఎవరింకను తమ యవస్థనుగురించి సందేహములో నుందురో, ఎవరింకను స్వల్పములైన సాంసారిక విషయములనే వాంఛించుచుందురో, వారికే యితరుల యామోదము, ప్రమాణమును కావలయును. దానివలన వారు క్రొత్త సంప్రదాయముల నేర్పరచుకొందురు. మీ దృష్టి నిర్మలముగ నున్నంతవరకు, మీరు సర్వగతమగు ఆ వాక్కును వినుచున్నంతవరకు, వినిన యా వాక్కు ననుసరించుచున్నంతవరకు, లోక మేమను కొన్నను సరకుచేయనక్కరలేదు. ఏలయన, మీరు మీ యుత్తమోత్తమ తత్త్వము ననుసరించుచున్నారు, గనుక, మీ రనుసరించు మార్గము

సరియైనదే యుండును. మీ దృష్టినుండి మరుగుపడియున్న వస్తువులను, మీరు స్వతంత్రముగ జూడఁగలుగుటకై మీ యందీ కాంతిను పుట్టించుటకు, నే నెంతయుఁ గోరుచున్నాను. మీరట్లు చూచి గ్రహించిన యెడల, లోకములోఁ బ్రవేశించి, యితరుల కండ్ల గంతలను విప్పగలరు. వారి కల్పసంతుష్టి కలుగజేయుటవలనగాని, క్షుద్రధర్మముల నుపదేశించుట వలనగాని, ప్రయోజనము లేదు. అందులకు మీరు లోకములో దూతలును, మేల్బంతులునై యుండవలెను. ఇతరులు చెప్పు దానితో సంతుష్టిపడియుండక, మీరు స్వతంత్రముగఁ జూచుటకును, వినుటకును, అభిలాష గలిగియుండుట యెక్కువ ముఖ్యమైనసంగతి. మొదట మీ కీ యుత్తమాభిలాష గలిగినయెడల, దానిని తీర్చుకొనుటకు తరువాత ప్రయత్నింతురు. ఆ పైని మీ రభివృద్ధినొంది, యాత్మోన్నత్యము గాంతురు. మనమందరమును, మనము కల్పించుకొనిన విషయమండలములో, కేంద్రస్థానముల నలంకరించి, మనలను గురించియే సదా చింతించుచున్నాము. కాని యీ చింతనము ప్రయోజనకరముగ నుండవలెను. సాధ్యమైనంతవరకు మనము భిన్నాత్ముల మని మరచి, అందరము నొక్కటేయని తెలిసికొని యుండవలెను. నాకు పింగళ దేహమును, నీలకుంతలములు నున్నను, నేను మీ యంశ గను, మీరు నాయంశలుగ నుండవలెను. ఇతరులతో మన మేకమై, భిన్నత్వమును విడనాడియు, మన దివ్యదర్శనము చెడకుండ నిలువఁ బెట్టుకొనియుండుటయే జీవితవిధానము.

---

# III

## దేహాత్మ[1]

సత్యమనియెడి పరమానందమును సాక్షాత్కరించుకొనుటకై యత్నించుట స్వసుఖముకొరకుగాని స్వసంతుష్టికొరకుగాని, కాదు. లోకమునకు సేవచేయుటకొఱకే, సాయపడుటకొరకే యని జ్ఞాపకముంచుకొనఁదగు. సేవ, ఉపకారము, అనునవి, అల్ప బుద్ధిగలవారును, అజ్ఞులును మాత్రము చేయదగిన వను నభిప్రాయము విడువవలెను. మరియును, ఇతరులకు సేవఁజేయుటవలన, యంత్రములవలె నింకొకరు చెప్పునట్లెల్ల చేయుచుండవలసివచ్చునని గూడ నెంచరాదు. సత్యము పరిపూర్ణముగ సాక్షాత్కరించుటలో యథార్థమగు నానందము లభించును. అప్పుడు పరోపకారము చేయకయుండజాలము.

నాకు పరమార్థ దర్శనము లభించినది. ఇక నిప్పుడెవ్వరును దానిని నాయొద్దనుండి వేరుచేయఁజాలరు. అది నాలో, నా దేహమునందు, జీవాత్మయందు, నా తత్త్వమునందే యిమిడిపోయినది. ఇక నది మార్పునొందఁజాలదు. నేను మారునట్లెల్ల నదియు ఎక్కుడు స్థిరమగుచుండును. మీరు నిరహంకారులు—అనగా, ఏ విషయమునందును,

---

[1] దేహాత్మ యన, అన్నమయ ప్రాణమయ మనోమయ కోశాభిమాని. అనగా, స్థూలశరీరముతోను, సూక్ష్మశరీరముతో లేక ఇంద్రియ మనోవృత్తులతోను తాదాత్మ్యము చెంది "నేను" అను ప్రత్యయమునకు మూలమగు జీవాత్మాంశము. వాస్తవముగ జీవాత్మ ఈ దేహములకంటె విలక్షణుడు.

అహంభావమును విడిచి, మీ యల్పదృష్టితో జూడ వలెనను కోరిక లేకుండ నుండువారు—అనుదురేని, మీ కా సత్యము కనపడును; మీ రా సత్యముతో తాదాత్మ్యము పొందగలరు. అయితే ప్రతివానికిని దేహాత్మ యుండక తప్పదు. మీరు దేహాత్మభావమును బోగొట్టు కొనరాదు, గాని స్వార్థపరులుగ నుండనక్కరలేదు. మీరు వికాసము నొందుకొలది, సత్యమును సమీపించుకొలదిని, మీ దేహాత్మవృద్ధియై, మీ యాత్మలు పుష్పములవలె వికసించును. అట్లుకాక సత్యమునకు మీ రెంతెదూరముగ నున్న నంత స్వార్థపరులై యుందురు. సత్యమును సమీపించుకొలదియు, దేహాత్మ యభివృద్ధియై, మీ స్వభావములు ప్రకటితము లగుచుండును.

నిరభిమానమను చిత్తవృత్తి పొందవలెనన, ప్ర ప్రథమున స్వసంతుష్టిని చేరనీయరాదు. మీ యభివృద్ధిని జూచుకొని సంతుష్టి పడుటకు సమ్మతించరాదు. లౌకిక వ్యవహారములలో జయమునొందినను, పారమార్థిక విషయములలో గౌరవార్హత పొందినను, మీరు దానితో సంతుష్టి బొంది, దానిని గొప్పగా జెప్పుకొనుట వాడుక. అట్లు సంతుష్టిపాలైనయెడల, మీ రభివృద్ధినొందరు, మీ గమ్యస్థానమును సమీపించ జాలరు. సుఖదుఃఖముల కతీతులై యుండుట నెరింగినగాని సత్యముచెంతఁజేరఁజాలరు. మీరు స్వాభిమాన పూరితులైనచో, స్వసంతుష్టికి లోనైనచో, మీ అల్పాత్మలతోఁ దృప్తిచెందినచో, మీరు బాధపడవలసి వచ్చును. అట్లుగాక, పరమార్థదర్శనమును నిరంతరమును మీ దృష్టిలో నుంచుకొని, దానిచుట్టును మీరు కల్పించుకొనిన యాచ్ఛాదనను తొలగించుకొనుచు బోవుచున్నంత వరకు మీకు స్వసంతుష్టియుండదు. మనుజు లీ లోకమందలి స్వల్పవిషయములలో విజయులైనంత మాత్రముననే, ముఖములపై సంతుష్టి చిహ్నములు తాండవమాడ, తామేమో ఘన కార్యము నిర్వహించినా మన్నట్లుం

డుట మీ రెరిగియే యున్నారు. క్రమముగ ఆ బాహ్యసంతుష్టి యాత్మకుగూడఁ బ్రాకి, తుదకు వారి యభివృద్ధి నిలచిపోవును. మీరీ గమ్యస్థానమునుఁ జేర నిచ్ఛయింతురేని, మీరీ సత్యమును బొందఁగోరుదు రేని, అల్పాలయములలో, అల్ప సత్యములకు పూజ లొనర్పఁ బూనకుడు. మీరు పూజ లొనర్చ వలసిన మహదాలయము మీ చెంతనే యుండ, మీరీ చిన్న ఆలయముల కేగుట యేల? మానవ పరిణామవిధి కనుగుణ్య ముగ, నిరంతరము నా సత్యదేవతయొక్క యద్వితీయమగు నాలయము దెస రథారూఢులై బోవుటకు బదులు, ఈ చిన్న ఆలయములచెంత తడవు మసులుచు కాలము వ్యర్థపుచ్చుచున్నారు. మానవకోటికంతకు నుద్ధారకుడగు నా పరమ గురువునందు మీకు నమ్మకమున్నయెడల, మీరు సమస్త పీఠములకును, సూత్రములకును, సిద్ధాంతములకును, అతీతులై, ఆచ్ఛాదనముల నన్నిటిని మించి సత్యదర్శనము సేయఁ గలరు.

---

# IV

## హృదయ దేవాలయము

మన మింతకుముందు సత్యమును గురించియు, ఆ సత్యమును, ఆ యానందమును పొందు విధానమును గురించియును ముచ్చటించుచుంటిమి. తత్త్వతః, సత్య మమూర్తమైనప్పటికి, నా దృష్టి కది నా పరమ గురువుయొక్క, నా పరమప్రియునియొక్క మూర్తియై యున్నదని మీకు నేడు నొక్కి చెప్పఁబోవుచున్నాను.

మీరొక దేవాలయములోనికి బోయి యచ్చటి గోడలు, స్తంభములు మొదలైన బాహ్యాంగములను మాత్రమే జూచినయెడల, మీకదియంతయు నిరుత్సాహకరముగను, కళావిహీనముగను గనఁబడును. ఏలయన, నా యాలయమునందు శిల్పరచనా కౌశలమును, లావణ్యమును ఉండినను, అందు మీ స్వనిర్మితమయిన ప్రతిమగూడ నుండవలయును. మన యందరకు నొక్కొక్క దేవాలయమున్నది, గాని, దానిలో నొక విగ్రహమును, ప్రతిమను, మనోహరమూర్తిని కల్పించుకొని, దాని నాధారము చేసికొని, ప్రేమను, భక్తిని వృద్ధిచేసికొనవలెను. మనలోఁ జెక్కుండ్రడ యాలయములలో ప్రతిమలు లేవు. ఆలయములలో ప్రతిమలు లేకుండుటం బట్టి, మనకు క్రియాశక్తి గలుగదు.

ఆరాధనముచేతను, ప్రేమచేతను, భక్తిచేతను, మనము ప్రతిమను సృష్టించి, మన యాలయము సజీవముగఁ జేయఁగలము. హృదయమే యా దేవాలయమని నేఁ దలచెదను. ప్రేమమూర్తియు, సత్య స్వరూపుడు వానిని హృదయములో నుంచుకొనిన యెడల, మీరాయన నచట మీ

స్వహస్తములతో, మీ స్వంతమనస్సుతో, మీ స్వంతభావములతో, నిర్మించుకొనినయెడల, ఆ హృదయము నిరుత్సాహ కరముగను, అమూర్తముగను, దూరముగను ఉండక, యథార్థమును, సచేతనమును, శోభాయమానమునై యుండును. సత్యము ఇట్టిది. ఇట్టి మూర్తివలన గలుగు ప్రాణశక్తి, జీవకళ, ఉజ్జీవన శక్తి లేనియెడల నాలయము కఠినమై, నిరుత్సాహకరమును, సంతోష విహీనమునై పోవును. అట్లుగాక, ఆ మూర్తిని ఆలయములో ప్రతిష్ఠించుకొన్నయెడల, మీరు ఆయనలో నొక యంశమై, కేవల మాయనయే యగుదురు. మీరు బాహ్యాలయములు. మీలోపల ఆ నిత్యవస్తువు వెలుగుచున్నది. పరమ పవిత్రమగు నా గర్భగృహములో మీరు ఇష్టమువచ్చినప్పుడు ప్రవేశించి, బాహ్య లోకమును విడిచి, యైహిక సంక్షోభములనుండియు, కష్టములనుండియుఁ దప్పించుకొని, సుఖముగ నారాధన నేయవచ్చును.

అయితే, ముందుగ ఆలయమును మనోహరముగ నలంకరించ వలయును. ఆయాలయము స్థూలదేహము. అది నిర్దుష్టముగను, బలిష్ఠముగను, సుందరముగ నుండునట్లు చేసికొనవలయును. సుఖ సమయమున గాని, దుఃఖసమయమున గాని, దినములో నే వేళప్పుడైన గాని, ప్రతియంగ విన్యాసమును, ప్రతి యవయవచలనమును, క్రియయును, నాణ్యముగను, అందముగను ఉండి, ఆ శరీరము నిత్యతత్త్వము వెలసియున్న యాలయముగ పరిణమించవలెను. కనుక దేహ మత్యంత పరిశుభ్రముగను, రమ్యముగను, దేదీప్యమానముగ నుండునట్లు చేసికొనవలయును. అట్లున్నయెడల, స్థూలశరీరచేష్టల ద్వారా మీ హృదయనిలయుడగు పరమ పురుషుడు ప్రకాశించుట కవకాశము గలుగును.

మనోభావములను సంస్కరించుటవలన స్థూలదేహము కూడ నాణ్యముగఁ బెంపొందునని మీ రెరుగరేమో! సంస్కారమును, నాణ్యమును లేనియెడల, దేహము మోటుదేరి, యంద వికారమై, లోపలనున్న

యా పరమపురుషుని తేజస్సు బహిర్గతము గాకుండ నాటంకమగును. ఆయనను మీ హృదయములలో నుంచుకొన నిచ్ఛయించినచో, ముందుగ నాయనకు వాసయోగ్యమగు గృహమును సిద్ధపరచి యుంచ వలయును. పిమ్మట, నా శరీర సౌందర్యమునలనను, మనోభావ ముల యుత్కృష్టతవలనను మీరు గంభీరమగు నానందము నొందుదురు.

మనలో చాలమందికి మననశీలురుగ నున్నప్పుడు సంతోషముగా నుండవలయు నను తలంపే యుండదు. సంతోషవిహీనమైన మనన శీలత, చాలమట్టుకు, కృత్రిమమైనదిగ నుండును. కనుక, సాధ్యమైనం తవరకు మనము దానిని విడువవలయును. పరమపురుషుడు హృదయ స్థుడై మీయందుండుటవలన గలిగిన సంతోష సహితమగు మననశీలత సమకూడినవారి వదన ముత్సాహపూరితమై గాన్పించును గాని వారి ముఖమునందు మనోవ్యధ చిహ్నములును, వికారచేష్టలును గానరావు. పరమ పురుషుని సంతోషముతో దర్శించ వలయును గాని, మనస్సు బిగియబెట్టుకొని, కృత్రిమ గాంభీర్యముతో దర్శింపరాదు. మీరు నిజమైన సుఖముతో నున్నప్పుడే, మీకు నిజమైన జ్ఞానము గలిగి నప్పుడే, మీరు నిజముగ సంతోషపూరితులై యున్నపుడే, ఆయనను దర్శింపగలరు, గాని నైష్ఠికులమని మూతులు బిగియఁబెట్టుకొని, పర మార్థసాధకులమని తలచుచు సంతోష హీనులై, యుండ వారిని దర్శింపఁ జాలరు. మీ యందు సంతోషము, సుఖము నిజముగ ఉప్పొంగు చున్నప్పు డాయన మీ హృదయదేవాలయములలో నివసించును.

నిన్న నేను విహారార్థము ఒంటరిగా బయలువెడలితిని. తత్కాలమున నేను గోల్పోయియుండిన సహజ సంతోషావస్థను తిరిగి తెచ్చుకొనఁ గోరితిని. భావములను, మనస్సును, ఒక యున్నత స్థాయికి గొని రేవలయునని విశేషప్రయత్నము చేసితిని, గాని కృతార్థుడను గాఁజాల కుంటిని. ప్రయత్నముతో నా యున్నతస్థితిని బొందఁ జాలకుంటిని.

నా గురువును, నా ప్రియుని, నాజ్ఞానమూర్తిని, నా యానంద దాయకునిఁ జేరగోరితిని. పూర్వమొకప్పుడు నే నిండియాలో నున్నపు డాయనను గాంచుట కిట్లే ప్రయత్నముచేసి, పెనుగులాడినంతకాల మును కృతార్థుడనుఁ గాఁజాలక, తుదకు అప్రయత్నముగ, నాలోనుండి యానందప్రవాహము పొంగుచున్నప్పుడు, ఆయననుఁ గనుగొంటిని. నిన్ననుగూడ నట్లే జరిగెను. అంతట నా మహనీయు డాకాశమును, తృణమును నిండి కనిపించెను; ఆమూలాగ్రముగ చెట్టునంతటను, గులకరాలలోను, అంతటను, నాయందును ఆయననే చూడగలిగితిని; ఇట్లు నా హృదయదేవాలయము పూర్తిగా నిండెను. అందలి గర్భా లయము అశేషముగ నిండెను. ఆ మహనీయుడే నేనును, నేనే ఆయన యును, అయితిమి. ఇదియే నాకు సత్యము.

సత్యమువలన నాత్మసంతోషము, భక్తి, నిర్మాణాభిలాష—అంత రంగమునందేగాక బాహ్యమునఁగూడ సృష్టించవలయునను అభిలాష— గలుగవలయును, గాని వ్యక్తముకాని కేవల సత్యమువలనఁ బ్రయోజనము లేదు. పక్షులు తమంతట తాము, సుఖముగా నున్నప్పుడు, తమ నిండు హృదయముతో నెట్లు గానము చేయునో, సత్యముకూడ తనంతట తాను వచ్చి మీ హృదయములను నిండవలెను. అయితే, అందు కనుకూల పరిస్థితులను సామగ్రులను ముందుగ మీరు సిద్ధపరిచి యుంచవలెను. ప్రతిమను జెక్కుటకు వలయుఁ జలువరాతిని మీరు జాగ్రతచేసి యుంచవలయును. సంతోషము, తీవ్రమైన ఆనందము, గంభీరమగు నానందము—ఇవియే ఆ చలువరాయివంటివి. గంభీరముగ నుండుడు. గాంభీర్యమనగా, మాతులు మూరెడు చేసికొని, వికార రూపముల దాల్చుట గాదు; సంతోషపూరితమగు గాంభీర్యము. క్రీడాసక్తి గలుగ జేయునదియు, ఉదారపురుషులుగ నుండ నాసక్తిఁ గలుగఁజేయునదియు, ఆనందముగ నుండ నుత్సాహముఁ గలుగఁజేయు

నదియు, నగు గాంభీర్యము కావలెను. మరియును, మీ హృదయముల లో నట్టి ప్రతిమను నిర్మించుకొనవలెను. మీ నిలయములు (ఇండ్లు) ఆయన యాలయములై యుండవలెను.

సత్యము నాకు దినదినమున నొక్కొక్క విధముగఁ గనబడును. ఒక పర్వతము పైకెక్కి చూచినయెడల, నదివరకు క్రిందనుండగాఁ గనబడని మరియొక పర్వతశ్రేణి యచట గనబడును. అదియే తుది యనియు, నచటనుండి చుట్టుపట్లనున్న వస్తువు లన్నియు గనబడు ననియుఁ దలచి కొని యా పర్వతముపైకిఁగూడ నెక్కుదురు, గాని, యచట నంతకంటె నెత్తైన మరియొక పర్వతము గానవచ్చును. సత్యవిషయమున గూడ నట్లే దృష్టి సతతము మారుచుండవలయును. సంపూర్ణముగ నా పరమ పురుషుని జ్ఞానశక్తితోను, బలముతోను, ఔదార్యముతోను నిండి యుండవలయునను కోరికయు, సామర్థ్యము నీకున్నయెడల, నీవే యా యౌదార్యమును వడసి, యా దివ్యస్వరూపము నీయందు ప్రతిబింబించు నట్లు చేయగలవు. ఆయనయే యపూర్వ కల్పనల కన్నిటికిని మూలము, సొగసుల కన్నిటికిని మూలము, సృష్టికంతకును మూలము. ఆ మూల మును జేరుటకు తగినంత తెలివియు, శక్తియు లేనియెడల, నపూర్వ ముగను, అందముగను, సృష్టిసామర్థ్యయుతుడుగను నుండుటకుఁ జేయు ప్రయత్నములన్నియు నిష్ఫలములగును. బయళ్లలో పచ్చిక పచ్చగ నున్నపుడు, ఆకాశము నిర్మలముగా నున్నపుడు, నిశ్చలత్వము పూర్ణ ముగ నున్నపుడు, (సంసార ఈతిబాధలు లేనపుడే) నీ మనస్సుతోడ ను, నీ చేతులతోడను నిర్మింపఁబడిన బింబమును నీ హృదయములో ప్రతిష్ఠించుకొనవలయును.

మీలో ప్రతియొక్కరి హృదయదేవాలయముయొక్క తలుపులను దెరచి, సూర్యకాంతిని లోపల ప్రవేశపెట్టి మీలోనున్న వికారములను రూపుమాపుటకును, తత్స్థానమున సౌష్ఠవమును నిర్మాణము చేయుటకు

ను, కుతూహలపడుచున్నాను. అదియొక్కటియే మీకు సత్యసిద్ధి గలుగుటకును, మీ హృదయములలో నా నిత్యవస్తువు నుంచుకొనుటకును మార్గము. ఆ పరమపురుషుడు తరుచుగ వచ్చుచునేయున్నాడు గదా! వారు మీ మీ హృదయములలోనికి వచ్చినపు, డాయన నా దేవాలయములలో నుంచుకొనుటకు తగిన సామర్థ్యమును, ఆయనతో వసించి యుండుటకు వలయు జ్ఞానమును, మీకుఁ గలిగి, మీరనుభవించిన పెక్కు కష్టములయొక్కయు సుఖములయొక్కయు ఫలమును గోల్పోకుండ నుండిననే, ఆయన మీయందు స్థిరముగనుండును.

ఆహా! ఆ యాలయములో, ఆ పీఠమునొద్ద, నారాధనఁ జేయుచు, తదితరమంతయు మరచియుండవలయునను నాశ మీకు గలిగినచో, మీ సంతోషము, ఆనందము ఎంత గాఢముగ నుండును!

నిన్న నేనొక్కక్షణ మాయనను గోల్పోతి ననుకొంటిని; నాకు ఊపిరాడలేదు, చలించలేకపోతిని. నా దేవాలయ ద్వారములన్నియు మూతలు బడి నేను కటికి చీకటిలోఁ బడితిని. ఆ తలుపులు తెరచి, ఆయనకొరకు వెదకుటకు పెనుగులాడవలసి వచ్చెను. తుదకాయన దొరకి, ఆయన సన్నిధిలో నుండుట యథార్థమని దెలిసికొనినప్పుడంతయు శాంతిమయమును, కాంతిమయమును, సంతోషపూరితము నయ్యెను. మబ్బు, వర్షము, తుపాను, పోయిన తరువాత సూర్యకిరణము వెలునడును. ఆ కిరణము నెదుర్కొనుటకై ప్రకృతియంతయు నొక్కమ్మడిని వికసించును. నిన్నటి నా యనుభవ మట్లే యుండెను.

ఈ సత్యము మీ హృదయములలో నుదయించినపుడు గలుగు ఈ శోభను, ఈ యౌదార్యమును, ఈ శాశ్వతానందమును, ఒకసారి మీరు ప్రత్యక్షముగ ననుభవించినయెడల, మీకీ లోకమంతయు పరమ పవిత్రమగు గర్భగృహమగును. అటుపైని మీరచటనే నివసించఁగలిగి, అదియే మీకు ప్రాణపదమై యచ్చటనుండియే చూడఁగలుగుదురు.

అంతట, మీరు చేయు ప్రతి కార్యమును, మీ రాలోచించు ప్రతి ఆలోచనయును, సార్థకములగును. మరియును మీకు యథార్థమగు చిత్తసంస్కారము, యథార్థమగు వైరాగ్యము, యథార్థమగు జ్ఞానము సమకూరును. మీకు జ్ఞానవికాసము గలుగుటకును, ఆనందము లభించుటకును, మార్గమిదియే. మీకిట్టి గంభీరమగు సంతోషముగలిగి, ఆధ్యాత్మిక, నైతిక, వైజ్ఞానికమగు క్షేమభావము గలిగినయెడల, మీకా దివ్యమహిమ గనిపించును. మీలో ప్రతియొక్కనికిని ఆజ్యోతి, ఆ పవిత్రత, ఆ ఔదార్యము, మహత్వభావము, ప్రాప్తమగును. ప్రాప్తించిన తరువాత దాని నీలోకమున నెద్దియును చెడఁగొట్టఁజాలదు. ప్రతి వస్తువునుఁగూడ ఆ మహనీయుని మహిమతో నిండియున్నది. నికృష్టములైనవన్నియును వాడి, కృశించి, చచ్చిపోవును. సకల వస్తుమూలమును జేరనివారికి గలుగు నష్ట మెంత విశేషముగ నుండునో మీకు తెలియదు. ఆ మూలమందే సకలమునకు నాద్యంతములను గనుగొందువు. ఇంతేగాక, నీవు ఆయనచెంత నుందువు, ఆయనలో నొక యంశమవై యుందువు; అనగా, నీవు వేన వేల భూతములకు మూలమగుదువు.

కనుక, నీ దేవాలయమును గురించియు, దానిలోని బింబమును గురించియుఁ జెప్పిన సంగతులు మీ మనస్సులలో నుంచుకొనుడు. మీరొక గదిలో నున్నను, లేక, వీధిలో నున్నను, ఆటలాడుచున్నను, పని చేయుచున్నను, ఆయన యెల్లప్పుడును మీచెంతనుండును గనుక, మీకు తొట్రుపాటు గలుగదు. మనస్సమాధానము గలుగును. దేవాలయము బైట పోట్లాట జరుగుచున్నను, లోపలనున్న దేవున కేమిగావలయును? నీవు శాంతముగ నుండి, నీవా దేవు నారాధించుచు, ఆరాధించునట్లు ఇతరులను ప్రోత్సహించుచు, ఇతరులను సుఖులుగఁజేయుచు నున్నంత వరకు, తక్కిన విషయములతో నీకేమిజోలి? భగవత్తత్త్వమును నిర్వ

చించువారు నీకనవసరము. బాహ్యములగు పూజావిధానము లేవియు నీ కక్కరలేదు; నీయందా మహాపురుషుని మహిమ ప్రకాశించు చున్నంతవరకు, నీ వానందముగ నుందువు; ఆ ప్రవాహమూలమున నీ పిపాసనుఁ దీర్చుకొనిన యెడల, నీవు జ్ఞానివై, సృష్టిసామర్థ్యముగలిగి, యితరులను సుఖింపఁజేతువు. అదియే మన జీవితోద్దేశము.

---

# V

## నది—మహాసముద్రము

### (వ్యష్టి—సమష్టి)

ఎటువైపు చూచినను అనంతమగు నిర్మలాకాశమును, లెక్కలేని క్రీనీడలును కానవచ్చుచున్న యీ దినమున మనము ముచ్చటించవలసిన విషయము ఆనందసామ్రాజ్యము అనునది యొక్కటియే; మరియును, బహిఃప్రపంచమునందు కనులపండువగు చిత్రవిచిత్రములైన కాంతుల మధ్యను మన మున్నపుడుఁగూడ పారమార్థిక సుఖము, ఆ యానంద సామ్రాజ్యము, మన హృదయములలో నిలిచియుండునట్లు జేయుట యెట్లో, అదియును మనము ముచ్చటింపఁ దగినవిషయము. ఆసామ్రాజ్య ప్రాప్తి కొక్కటియే మార్గమున్నది. అదియేదన, నిన్ను నీవు మరచి, నీ యాత్మయు ఆ నిత్యవస్తువు నొక్కటియేయని తెలిసికొనుట. మన మింతవరకు వినుచున్నట్టియు, గౌరవించుచున్నట్టియు, అంతరంగ వాక్కు మనల నెప్పుడో యొకప్పుడు, సర్వపరిత్యాగము జేసి, యా పరమపురుషు ననుసరింపఁబోవుటకు ప్రోత్సాహము చేయక తప్పదని, మనకు గట్టి నమ్మకము—కొందరకు కేవలము నమ్మకము మాత్రమే గాక ప్రత్యక్ష జ్ఞానము. అట్టి భాగ్యము మనకందరకును తప్పక లభించును. ఆ యాజ్ఞ మనలో నొక్కొక్కని కొక్కొక్కరూపమున, నొక్కొక్క స్వభావముతో, నొక్కొక్క పరిస్థితియందు వచ్చును. కాని వచ్చుటయేమో తప్పదు. అయితే అది వచ్చినప్పుడు దానిని

మనము ఏ చిత్తవృత్తితో, నేభావప్రవృత్తితో ననుసరించవలయును? మనము సర్వపరిత్యాగముచేసి, యా పరమపురుషు నెట్లు అనుసరింతుమో? దానివలని ప్రయోజనమును మనమెట్లు పొందుదుము?

ఇట్టి సందర్భమునందు ఎట్లు వర్తించఁదగునని నామట్టుకు నేను యోచించితిని. సాధారణములగు నైహిక సుఖములను, ఐహిక క్షేమమును, విత్తమును, కుటుంబ సంబంధములను, త్యజించుట సులభమని నాకు తోఁచుచున్నది. అంతకంటె నెక్కువ కష్టమైనదియు, నెక్కువ ముఖ్యమైనదియు, ఎక్కువ త్యజనీయమైనదియు, పూజనీయమును, పావనము నైనదియు నింకొకటియున్నది. అదియేదన, భిన్నభావమును విడిచి పరమపురుషునితో నేకీభావము నొందుటయె. ఆయనతో నేకీభావము నొందుట యనగా, మీ చిత్తవృత్తులను, మీ దృఢాభిప్రాయములను, మీ మీ యభిరుచులను, మరియిట్టి యితర విషయములను విడిచిపెట్టుట. ఇది కష్టతరమైనను మీకిదియే కర్తవ్యము. అనగా మీ స్వభావములను మరచి, అయనవలె నుండవలెను.

ఒక చిన్న గుట్ట దానివెనుకనుండు నున్నత హిమవత్పర్వత శ్రేణి నంతయు మన దృష్టినుండి మరుగుచేయుటను ఎన్నడైనను గంటిరా! మనము దానిని జూడఁజాలక యా గుట్ట తప్ప మరియేమియు నచట లేదనుకొందుముగదా. వెనుకనున్న పర్వతశ్రేణి, పెక్కు మైళ్లవరకు వ్యాపించియున్నను మనకు గోచరముగాదు. అట్లే మనము స్వల్ప విషయములను త్యజించి, త్యాగులమైతిమని సంతసింతుము. స్వల్ప విషయములు లెక్కలేదు. వానిని విడువ నక్కరలేదు. వానిని విడుచుట చిన్న కొండయెదుట నిలచుటనంటిది. ఆ కొండను దాటి యావలకు బోయినఁగాని యా వెనుకనున్న యున్నత శిఖరములు గనిపించవు. నా ప్రత్యేకపద్ధతిని బట్టుకొని విడువనని, నా చిత్తవృత్తినే యవలంబింతునని, నా భక్తినే, నా పూజావిధానమునే యనుసరింతు

నని, భీష్మించుకొని మీరు కూర్చొనిన ప్రయోజనములేదు. చంద్రోదయము కాకముందు నక్షత్రములు మిక్కిలి కాంతితో నందముగ బ్రకాశించును, గాని చంద్రోదయమైనంతనే యాకాశమునంతను ఆ ప్రభువు కాంతులు వ్యాపింప, నవి కాంతిహీనములగు. అట్లే మీరును మన నాయకు డుదయించినంతనే మీ మీ స్వభావములను వెనుక బెట్టవలెను. అయితే మీ రాయనవలెఁ గావలెనుగాని మీ వ్యక్తిత్వమును మాత్రము గోల్పోగూడదు. వ్యక్తిత్వమును గోల్పోకుండ మీ రాయనవలె గావలెనని, మీ జీవితములలో బ్రతి విషయమును, ఆయన దృష్టితోఁ జూడగలిగి యుండవలెను.

ఒక చిత్రకారుడు మేఘమునుగాని, ఆకాశమునుగాని, చెట్టునుగాని, చూచినచో, వానికవి యొక్క విశేషార్థమును స్ఫురింపఁజేయును. అతడు వానినెట్లు చిత్రించవలెనను దృష్టితోఁ జూచును. వానిని యథారూపముగఁ జిత్రించక, వానియం దితరులు చూడని విశేషములను తాను జూచి, వానిని లోకమునకుఁ దెలియఁజేయగల చిహ్నముగ నెట్లు చిత్రించవలెనని యోచించును. మీరుగూడ నట్టి దృష్టితోఁ జూడవలెను. బంధహేతువులగు విషయములన్నిటిని మీరు నాశనము చేసి, ఆయనతో నేకీభవించి, ఆయనలో నొక యంశగ నుండఁదగు నున్నతస్థితిని బొందవలెను. ఆ యున్నతస్థానమునుండి మీరు మిమ్మును, ఈ లోకమునుగూడఁ జూడవలెను. మీ మీ స్వంత ఉల్లాసములలోనే యెల్లప్పుడును మునిగియుండుటవలన ప్రయోజనములేదు. వానిని విడిచి ఉన్నతస్థానముఁజేరి యచ్చటినుండి మీ స్థూల సూక్ష్మదేహములను నియమించవలెను. మీ రాయన ననుసరింపఁగల విధ మదియొక్కటియే.

మీరు సంపూర్ణ ప్రమాణముగ నంగీకరించిన యంతరంగవాక్కు వినవచ్చినంతనే, దానిని యథార్థముగ గ్రహించి, యనుసరించువారు మీలో నెందరున్నారు? ఆయన ననుసరించువారిలో నెందరు,

సముద్రములో జలబిందువు చేరినట్లు, మహాసముద్రములో నది మిళిత మైనట్లు, ఆయనతో మిళితము గాఁగలరో చూడుడు. మీరందరును భిన్నభావముతో నత్యంతము సంకుచితులై యున్నారు. ఒక్కొక్క రికి నొకదేవుడు, ఒక విశేష సంతోషము, ఒకమాటతీరు, ఒక మనో వృత్తి, ఒక ముఖవైఖరి. ఆయన ననుసరించుటయనగా గ్రుడ్డిగా ఆయన చెప్పునదంతయు నంగీకరించుట కాదు. కన్నులు తెఱచి యుంచుకొని, హృదయములు స్వచ్ఛములుగ నుంచుకొని, పక్షపాత ములను, దురభిప్రాయములను తొలగించుకొని, ఆ నిత్యవస్తువులోఁజేరి మిళితమగుటయే నిజమైన యనుసరణము. అనుసరణమున కిది యొక టియే మార్గము. నిర్మాణము చేయగలుగుట కిది యొక్కటియే సాధనము. ఆ నిత్యత్వములో, ఆ యుత్తమ స్థానములో, నివసించి యుండఁ గలుగుదురేని మీరు పరిపూర్ణ ధీమంతులై, కుతూహలము గలిగి, యానందము ననుభవింతురు. భిన్నాత్మభావమును మఱచి, స్వాభిమానమును నాశనము జేసి, జగత్తుతో నైక్యము నొందుటవల ననే యానందప్రాప్తి గలుగును. కాని, ప్రత్యేకముగ కొన్ని సంఘ ములని, కొన్ని స్వభావములని, కొన్ని వేర్వేరు మాదిరులని, యీ విధముగ భేధముల నెంచుచున్నయెడల, నివియన్నియు భేదచిహ్నము లనియును, మీ మీ పరిస్థితులను సూచించు గుర్తులనియును నెరుంగఁ జాలక, సత్యమునకు దూరముగనే యుందురు. ఇవేవియును సమస్యను దీర్చఁజాలవు. భిన్నాత్మభావమును మఱచి, నిత్య వస్తువులో నేక మగుట యొకటియే దానికి మార్గము.

క్షణభంగురమును, అస్థిరమునగు నైహికవిషయముల ననుసరించక సనాతనమును, అవికారియునగు నా నిత్యవస్తువు ననుసరింపుడు. ఆత్మవికాసమున కనువగు నవకాశములను ఈ స్థూలప్రపంచమునందే కలుగఁజేయుట యావశ్యకమని తెలిసినయెడల, మీ జీవితోద్దేశమును

యథార్థముగఁ జూడగలుగుదురు. మన మెప్పుడును ఐహికసంబంధమగు విద్యలను గురించియే యోచించు చున్నాముగాని, పారమార్థికమగు విద్యనుగురించి యోచించము. జీవాత్మ వికాసమునొంది పరిపూర్ణతను బొందఁగోరుచుండును. ఈ లోకములో మనము ఆ యాశను దెలిసి కొన్నయెడల మనము ఎప్పుడు ఏ విధముగా జీవుని కాంక్షలను గౌర వించవలెనో దెలిసికొనవచ్చును.

ఆనందసామ్రాజ్య మెంత విశాలమైనదో, మీ కెవ్వరికిని గోచరము కాలే దనుకొనుచున్నాను. మీరందరును ఆ సామ్రాజ్యమున నివసించుట కభ్యాసము చేసికొనవలసి యున్నది. ఆనందము ఇట్టిదని మీకు తెలి యదు. నిజమైన యానంద మీ యైహికాాముష్మిక విషయములన్నిటి కిని అతీతమైనది. అనుభవించ నర్హమైన యవస్థ అది యొక్కటే. సాధించి నిలుపుకొనఁదగిన సామ్రాజ్య మది యొక్కటే. అందుచేత దానిని దెలిసికొనుటకు మిమ్ముల నందఱను ఆ సామ్రాజ్యమునకు నేను కొనిపోయి, దాని శోభను మీకుఁ గనపరచవలసి యున్నది. ఒకతూరి అనుభవించిన, నిక దానిని వదలరు ; నశ్వరములైన విషయముల కోరరు ; ఇక నెన్నటికిని అనిత్యములును, వికారములును, అగు వస్తువులను గోరరు. కాలక్రమమున, నదియే మీరు పొందదగినదియు, మీరిత రుల కొసంగఁదగినదియు నగు సత్యమని మీకు గోచరించును.

ఇదిగాక, మీకు గ్రంథపఠనమువలనను, సాధారణమగు నైహికాను భవములవలనను, దీర్ఘాలోచన, ఆనందము, గంభీరమగు సంతోషము వలనను, గలుగు పరిజ్ఞానముగూడ నవశ్యముగ నుండవలెను. ఈ యన్నిటివలనఁ గలుగు పరిజ్ఞానమును సంపాదించి, ఆ పరిజ్ఞానము మీకు స్వాభావికమైనప్పుడు, మీ రాయనకు నిజమైన యనుచరులు కాఁ గలరు. పరిజ్ఞానము, సంస్కారము, లేనియెడల, మీ రా పరమ జ్ఞానియు, పరమ రసజ్ఞుడునగు ఆయనతోఁ జేరజాలరు ; ఆయనతో

జేరుట యటుండ, ఆయన పక్షమున నిలిచి, ఆయన సేయుపనిలో మనః పూర్వకముగ తెలివి తేటలతోఁ దోడ్పడజాలరు. ఉన్నదానితో సంతుష్టులై తాను ప్రత్యేకముగ నిర్మించుకొనిన పీఠముచెంత నర్చించుచు కూర్చొను వానికంటె, నొక లలితకళాప్రవీణుడా పరమపురుషున కెక్కువ సన్నిహితుడు. ఏలయన, నాతడు స్వతంత్రముగ సృష్టించుచుండును, కష్టమును అనుభవించుచుండును, తొట్రుబాటు బడుచుండును.

మీ రట్టి కళాప్రవీణులై, ఆ పరమపురుషునికి సహాయులై, ఒక్కొక్కరును గ్రహించిన విషయములను లోకమునకు నొసంగవలెను. ఆ స్థితికి వచ్చినప్పుడు, మన మార్గమున కాటంకములై, మనయుత్సాహమునుఁ జంపి, మన స్వస్థతను తగ్గించునట్టి యొంటరి భావమును, హృదయదౌర్బల్యమును మాయమైపోవును. జీవితమున కంతకును ముఖ్యమైన యీ సామ్రాజ్యములో నీ వొక భాగమైనప్పుడు, కల్పాంతము వరకునుండు నా పరమజీవితములో నీ వైక్యమైనప్పుడు, నీ వేకాకివని గాని, నీవు భిన్నుడవని గాని, నీవు గొప్పవాడవని, జయశీలుడవనిగాని స్మరణయే యుండదు. మీరా స్థితి కెక్కినప్పుడు పరస్పర స్నేహమును, ప్రేమయును ఉండవనియును, ఏకాకులమై పోదుమనియు భయపడుదురు. స్నేహము, ప్రేమ, యివి తాత్కాలికముగ సుఖము నొసంగునవియైనను, వానివలన కొంత ప్రయోజనమున్నను, మీకవి యచట లేవన్న లోపముండదు. ఏలయనిన మీ కచట నా నిత్యవస్తువుతో సహవాసము లభించును. ప్రతిచెట్టును, ప్రతిపిట్టయు, ప్రతిగడ్డిపోచయు, ప్రతినీడయు, ఆ నిత్యవస్తువు నందలి యంశలేగనుక, వానివలన నప్పుడు కేవల మింద్రియతృప్తిగాక, యంతకంటె విశేషమగు ననుభవము గలుగును. అందుచేత మీ జీవితమున కా సామ్రాజ్యమును కేంద్ర స్థానముగఁ జేసికొని, యచ్చట నిత్యవస్తువునుండి మీ రీ సంసారమును జూడగలిగి యుండవలెను.

# VI

## అనుభవమువలని ప్రయోజనము

ఏ శాసకుని వాక్కును మీరు పాటించవలసినదో, యెవరి యాజ్ఞ యొక్కటియే మీరు పరిపాలించవలసినదో, ఆ యంతరంగ వాక్కును గురించి చెప్పఁగోరుచున్నాను. మీ పరిణామము ప్రారంభము కాగానే, గొన్ని క్లిష్టసమస్యలును, కొన్ని కష్టములును మీకు సంభ వించుట సహజము. వీని నన్నిటిని మీరు స్వీయముగ పరిష్కరించుకొన వలసి యున్నది. పెక్కు తుపానులకు నిలిచి, తన బలమును తాను తెలిసికొని, తాను జీవకోటికి రక్షణము నొసంగుటవలన గలుగు సం తోషము నెరింగి, భూమ్యాకాశములలోని వాయువు మొదలగు నదే దియుఁగూడ తన్నూడఁబెరుకఁజాలనంత దృఢముగ, నొక స్థాణువువలె, నిలిచియున్న వృక్షరాజమువలె మీరు గావలెను. సముద్ర మధ్య ముననున్న కొండ యన్ని వైపులను కెరటములు గొట్టుచున్నను చలించక స్థిరముగ నిలిచియున్నట్లే యా వృక్షముగూడ, వేళ్లు లోతుగ బారియుండుటవలన, స్థిరముగ నిలిచి, యనేక పక్షులకు ఆశ్రయము నొసంగుచున్నది. మీరట్లు కావలెను.

దేనివలనను చలించనిదియును, నిర్వికారియునగు నంతరంగవాక్కు ఒక్కటియే మీకు ప్రమాణమై యుండవలెను. తదనుసరణమువలనఁ గ్రమముగ మీకు స్వీయమగు సౌందర్యజ్ఞానము గలిగి, కాలానుసరణ ముగ నది వృద్ధియై, మీ కానందము నొసంగును. నాగరికుడును, విజ్ఞుడును, పారమార్థికుఁడు నగు వా డంగీకరించదగిన ప్రమాణ మంత

రంగవా క్కొక్కటియే గాని, యితరులు చెప్పునది, యితరులు పర మార్థ మిదియని నిరూపించునది, ప్రమాణము గాదు. ఏలయన మీ యంతరంగమునకు సమ్మతమగు దానిని మాత్రమే మీరు ఒప్పుకొనఁ గలరు.

ఆ వాక్కును, ఎవ్వరికిని లోబడని యూశాళకుని ఆదేశమును వినుట యెట్లు? అను విషయమును విచారించుచు, నొకటి రెండభిప్రాయ ములను పరిశీలించి చూచితిమి. ఇప్పుడు మరియొక యభిప్రాయమును దెలుపఁగోరుచున్నాను. ఆ వాక్కును దెలిసికొనవలెనను ఇచ్ఛ మీకు ఉండినయెడల మీలో సర్వమును తలక్రిందుజేయు మార్పు గలుగ వలెను; గొప్ప యరాజకము, గొప్ప యసంతుష్టి పుట్టవలెను. సుడి గుండమునందు సుడులు పుట్టి గడబిడచేసినట్టు, మీ మనస్సులలోను, హృదయములలోను, గొప్ప కల్లోలము బయలుదేరి, అది యంత కంతకు తీవ్రమై లోపలనున్న తుచ్ఛ విషయములను బయటకుఁ ద్రోసి వైచి, జీవితోద్దేశముయొక్క బలము మాత్రమే మిగిలియుండవలెను. "మీలోఁబుట్టిన సంకులమునుండి ఆనందతాండవ మాడు తారకము పుట్ట వలెను" యథార్థమగు సంతుష్టిని గలుగజేయు శక్తిగల అసంతుష్టిని మీరు బలపరచవలెను గాని, దానిని నిరాకరించుటగాని చంపుటగాని కూడదు. మీ సంశయములును, జ్ఞానవాంఛయు నెక్కువ కాను కాను, ముందు సూచించిన సుడులు బలమగుటయును, తుచ్ఛ విషయములు చెదరిపోవుటయును, సత్యాన్వేషణాభిలాష యెక్కువ యగు టయును సంభవించును. అయితే మీ హృదయములలోను, మనస్సుల లోను, గొప్ప సుడిని బుట్టించవలెనుగాని, ఆ సుడులు రసోద్రేకము వలనను, తొట్రుపాటు వలనను, బుట్టునవిగా నుండక, తుచ్ఛ విషయ ముల నావలకు ద్రోసివైచి నాశనమొనర్చునవియును, ఏకోద్దేశము

3

నాశ్రయించి యుండునవియునై యుండవలెను. అట్టిసుడి త్వరితగతిని పరిభ్రమించి, యెక్కువ శక్తినిఁ జేర్చుకొనును. ఆశక్తిలోనుండి జ్ఞానము స్వనిర్మిత ఆనందతాండవ తారకము బయలువెడలును.

దివ్యమగు నీ యసంతుష్టిగలుగుట యెట్లు? ఇతరుల బోధల వినుట వలననే యది గలుగదు. మీరు స్వయముగ పైకెక్కి కట్టడముల కట్టుటకు ఇతరులు సారువ (పరంజు) లవంటివారు. ఆ సారువలమీదుగా మీరు స్వయముగా మీకు కావలసిన సున్నము, ఇటికలు మోసికొని పోయి, మీరు ఇచ్ఛయించు కట్టడమును మీరే కట్టుకోవలయును. అందుకై మీరు స్వయముగ ననుభవముల నన్నిటిని అనుభవించవలెను. అందువలననే కేవల అమాయకత్వము పారమార్థికము గాఁజాలదు. గొప్ప దుఃఖములను, గొప్ప హర్షోత్కర్షములను, గొప్ప భక్తిని, పూజా పరవశత్వమును, గొప్ప క్రోధావేశములను, అనుభవించినవాడే యథార్థమగు తత్త్వవేత్త కాఁగలడు. ఏలయన, నతడు నిరంతరమును జిజ్ఞాస చేయుచు, పరమార్థము నన్వేషించుచుండును.

పరమార్థము నొందుటకు, ఆనందము ననుభవించుటకు, లోకసేవఁ జేయుటకును, విషయాకర్షణముల నెదిరించఁగల అంతఃకరణము మీకుండవలెను. విషయముల ఆకర్షణమును ఎదిరించుటకు అనుభవ మతి అవశ్యము. బాలురవలె నిర్దోషులు[1], విషయతీవ్రతనే తెలియని వారు, అల్పులుగను, సంకుచితులుగను, మాత్సర్యముగలవారుగను పెరుగుదురు. అట్టి యల్పగుణములను బోగొట్టుకొనుటకే మనము పెనుగులాడవలయును. ఈ యల్పగుణములు యథార్థములును, గొప్పవియునగు నను

---

[1] "నాఽనుభూయ నజానాతి జంతుర్విషయతీవ్రతాం" అని దక్షుడు నారదమహామునితో వాదించెను. విషయములను అనుభవించి వానియొక్క అద్భుతశక్తిని ఎరిగినవారే విషయబద్ధులైన వారిని ఆ బంధమునుండి విడిపించుటకు శక్తిగలిగి యుందురు.

భవముల నొసంగఁజాలవు. లోకానుభవములేని బిడ్డల అమాయకత్వము వంటి యమాయకత్వము పనికిరాదు. బిడ్డకు చిక్కులలోపడి శ్రమ పడుట అనునది తెలియదు; రాగోద్రేకములలో జిక్కుకొని చీకాకు పడుటయేమో తెలియదు; మనోవ్యథ లన నేమో తెలియదు. ముద్దు మాటలతో నర్థములేని పలుకులు బలుకుట, ప్రేలుట మాత్రము తెలి యును. కష్టముల ననుభవించి తేరినవాని వలె, తెలిసినవానివలె, స్వతంత్రసృష్టిఁ జేసినవానివలె, శక్తిమంతుడుగా నీవుండవలెను. మీ స్వంత చర్యలవలనఁ గలుగు హర్షమే మీకుండవలెనుగాని, యితరుల హర్షము మీకు పనికిరాదు. ఇట్లు చెప్పినమాత్రముననే మీరు అసంగత ములగు ననుభవములలోనికి దిగి, మీ భావములను అనుచితరీతిని వ్యక్తముచేయరాదు. సామాన్య సుఖదుఃఖములే మీ కనుభవ యోగ్య ములుగ నుండవలెను. ఆ యనుభవములనుండియే మీరు నిర్మించు కొనఁ దగు. అవి మీకు కాలువలు, నదులు. మీ మీ స్వానుభవములను, మీ మీ పృథగ్భావములను విడిచి, ఏ మహా సముద్రములో జలబిందువుల వలె ఏకీభూతమై పోవనున్నారో, ఆ మహా సముద్రమునుఁ జేరుటకు ఆ నదులమీదనే, ఆ కాలువలమీదనే మీరు ప్రయాణము చేయవలెను. ఆ ప్రయాణమునకు ఓడలు గావలెను; ఆ యోడలను మీరు స్వాయ ముగ నడుప గలిగియుండవలెను. అనుభవ సామగ్రిని కూడఁ బెట్టుకొని, సరియైన నూతనానుభవములు గలుగునను ఉత్సాహముతో మీరుండ వలెను. దీనికే ఆత్మసంబంధమగు అసంతుష్టి అని పేరు. మీకు ఈ అసంతుష్టి, ఈ కల్లోలము, తప్పక గలుగవలెను. దానిలోనుండి యానంద తాండవరూపమగు తార ఉద్భవించవలెను.

చాలమంది స్వసంతుష్టిని పొంది, తమ యల్ప జీవితములతోనే తృప్తి నొంది, జన సామాన్య సాధ్యమగు అల్పజీవితమును కల్పించు కొందురు. అట్లుండుట మీ కిష్టము లేనియెడల, మీ నిజస్థితిని మీరు తెలిసికొని,

మీ యాత్మను వికసింపఁజేసికొని, మీ మార్గమును మీ రనుసరించి, మీ పరమావధి నెల్లపుడును దృష్టిలో నుంచుకొని, యుండవలెను. ఆనందమే, పరమ సత్యమే, యీ పరమావధి. తూలివాడు చేపల పట్టుటకు బయలుదేరి యొక చిన్న చేపగాని, యొక పెద్దచేపగాని దొరికినంతమాత్రముననే తృప్తినొందక, ఒక కొలనునుండి మరియొక కొలనుకు, నదినుండి నదికి, సముద్రమునుండి సముద్రమునకుఁ బోయి మేలైన చేపలను బట్టును. అనుభవములను సంపాదించును. అట్లే మీ రును ఈ జీవితానుభవము లనెడు సముద్రము లన్నిటినుండియు పలు రకములు, పలు వర్ణములు, పలు రూపములుగల యీశ్వర విభూతిని ప్రోగుచేసి యుంచుకొనవలెను. అనుభవమువలన, ఆలోచనవలన, రాగాతిశయమువలన, మాత్రము గలుగు ఆ పరమవాక్కుయొక్క పిలుపును మీరు స్వయముగ వినవలెను. ఈ దివ్యవాంఛ, యీ భయరహితమగు కాంక్ష గలిగినయెడల నిక మీ యెదుట పటములనుంచుకొన నక్కరలేదు. ఇక పూజాది కర్మల నొనర్చ నక్కర లేదు. ఈ లోకములో నిక దేనిసహాయముగూడ మీకక్కరలేదు. ఆకాశమున నెగురుచుండు పక్షి రెక్కలపై మెరయుచున్న కాంతియందు, ఒంటరిగా నిలచియున్న చెట్టునందు, నిశ్శబ్దములగు పచ్చిక బయళ్లయందు, ఆ ప్రక్కనే ప్రవహించు సెలయేటియందు, పుష్పమునందు, దైవత్వము వసించియున్నది. అవియే జీవితతత్త్వములు; అవియే యథార్థములగు పరమార్థ స్వరూపములు. ప్రతిదినమును మీరు సంధించు స్వల్పవస్తువులలోని సత్యమును గ్రహించి, వాని సౌందర్యమున నిమగ్నులై యుందురేని, యా పరమసత్యవస్తువును బొంది, యా యానంద సామ్రాజ్యములో వసించఁగలరు. మీకు ఆస్థితి ప్రాప్తించినపుడే, దాని నొరుల కొసంగఁగలరు. ఆ సామ్రాజ్య నివాసము తనకు ప్రాప్తించకయే, ఇతరులకు ఆ సామ్రాజ్యమును గురించి నమ్మించఁ జూచువాడు దొంగ.

తత్ప్రాప్తి యెంత కొంచెమైనను గలవాడు, తానెరిగిన దానిని నిశ్చయముగను, ప్రామాణ్యముగను నితరులకుఁ జెప్పగలడు. ప్రపంచముతో, మానవకోటితో, దుఃఖితులందరితో, సుఖులందరితో, తానొక్కటి యని నీవు దెలిసికొనిననాడే సప్రమాణముగ మాటలాడఁగలుగుదువు. అపుడే స్వతంత్రముగ నభిప్రాయములను గలుగఁజేసికొనఁగలవు. ఇతరులకు స్వతంత్రాభిప్రాయములను గలుగఁజేసికొన సహాయముచేయఁగలవు. ఆ యేకీభావమువలన నీ జన్మమునకు క్రొత్త శోభగలుగును, క్రొత్త సంతోషము, క్రొత్త యుద్రేకము లభించును. అప్పుడీ బాహ్యస్వరూపములు పద్ధతులును నిరర్థకములగును. ఏలయన, నీవపుడు సకలవస్తువులకును సనాతనమగు మూలమును జేరియుందువు. అయితే, నీవా మూలమునకు బోవుట యెట్లు? ఈ సంకులావస్థయు, ఈ యసంతుష్టియు, ఈ నిరంతరమగు తీవ్రేచ్ఛయు నున్ననే నీవచటికిఁ బోగలవు. నిత్యవస్తువు నొక్కసారి దర్శించినంతనే తృప్తికలుగదు. ఒక దర్శనము మరియొక దానికిఁ ద్రోవదీయును; అది మరియొకదానినిఁ గనబరచును. ఇట్లే జన్మ జన్మమునను జరుగును. సృష్టిపరిణామ మొక్కమారాకస్మికముగఁ బ్రారంభించలేదు; ఒక్కసారి, ఒక్క జన్మాంతమున, నిలచిపోదు. అది యంతములేని యొక బాట. దానియందు నడచుటలో నానందించువాడు ప్రక్కనున్న ప్రతి చిన్న యాలయములోను పూజించుటకు, ప్రతి లౌకికాచారమును మన్నించుటకు, ప్రతిబాహ్యస్వరూపమును, గొప్పవని యెన్నఁబడు ప్రతిపీఠమునొద్ద యారాధించుటకును, నిలునఁబోడు. అట్లు కానియెడల, ఆత్మవికాస మతి దీర్ఘకాలమనుభవించవలసిన దుఃఖముగనేర్పడును. కష్టములకులోనై, సుఖముల ననుభవించి, జీవితసౌందర్యము నెరింగి, స్వయముగ కల్పించుకొనిన యాలయమును, స్వనిర్మితమైన విగ్రహమును, దూరమునఁ జూడఁగల వాడే ఆనందసామ్రాజ్యములో నిరంతరము మసలువాడు.

నీవు విజ్ఞుడవుగాగాని, సృష్టిసమర్థుడవుగాగాని, నాశనకరుడవుగా గాని గావలెను; లేక ప్రవాహమునఁబడి నిటునటుఁ గొట్టఁబడుచుండు తృణమువలెనైనఁ గావలెను. నీ వాయనలో వసించి, ఆయనలో పెరుగు చున్నావు. కనుక నీవు జీవితశక్తియొక్క ప్రధాన ప్రవాహము పై యుండవలెను. సౌందర్యమే సత్యము. ఆ సత్యమే మీరు పొంద కుతూహలపడు పరమపురుషుడు; మీరు పూజించు దివ్యమూర్తి; మీ హృదయములలో మీరు నెలకొల్పుకొనిన మూర్తి. ఆయనను జేరుటకై మీరు ప్రయత్నించి, ఆయనను గనుగొంటిరి; గనుక, ఆయన మీలోఁ జేరి మీయం దొక భాగమగుచున్నాడు. ఈ యుత్తేజనము గలిగిన యెడల జీవించుటకును, ఊపిరి విడుచుటకును, ఆలోచించుటకును, అనుభవించుటకును, ప్రోత్సాహము గలుగును. అట్లుగాక, ప్రస్తుతా వస్థతో సంతుష్టి పొందినయెడల, పారమార్థిక మహోద్రేకము మీకుఁ గలుగఁబోదు; పరులకు సహాయులుగ నుండుటకుబదులు మీరే యనుచరు లగుదురు; మీరు సృష్టికర్తలగుటకుబదులు నిరర్థకులగు సామాన్యు లగుదురు.

ఈ యుత్తమావస్థను, ఈ విజ్ఞానమును స్థిరముగ నుంచుకొనుట, ఈ యానందసామ్రాజ్యములో నివసించుట, యెంత ముఖ్యమో మీరు చూడఁగలుగుదురుగాక! మీరు తప్పక చూడఁగలుగుదురని గూడ నా దృఢనమ్మకము. ఏలయన, ఆనందపరవశులగు సమయములలో నొక్కొక్కరును జూడఁగలుగుదురు. ఆ సామ్రాజ్యములో సురక్షితులై యున్నయెడల, నటనుండి బయటకుఁబోయి, యితరులందరికంటెను ఎక్కువ బలముగనో, ఎక్కువ ప్రమాదకరముగనో, ఎక్కువ యుదారముగనో సృష్టించఁగలరు. ఎందుచేతననగా, నెప్పుడు కావలసిన నప్పుడా సామ్రాజ్యములోనికి మరలి పోఁగలరు. అట్లుండఁగలిగినచో హర్షోద్రేకమును, ప్రాణశక్తియు మీకుఁ గలుగును; మరియును, మీ హృదయ

ములలోనే గాక, యితరుల కుపకారము చేయుటయందును, పనికి మాలిన విషయములను నాశనముచేయుటయందును, శాశ్వతములగు విషయములను సృష్టించుటయందును మీరు గొప్పవారుగ నున్నారను భావము సైతము మీకుఁ గలుగును. మీ రజ్ఞానప్రచండులయియుండక, మహాస్రష్టలుగ నుండవలెను. తత్త్వమును దెలిసికొను సాధనము మన సమీపమున ప్రతిరాతి క్రిందను, చరాచర భూతములన్నిటిలోను, చేతనా చేతనము లన్నిటిలోను దొరకుచుండగా, మనము నేడెంతయో వితర్కము చేయుచున్నాము, ఎంతయో వెతుకుచున్నాము, ఎంతయో తడుముకొనుచున్నాము. మీకు యథార్థమైన జ్ఞానసిద్ధి గలిగినయెడల, మీరా యానందసామ్రాజ్యముయొక్క దూతలుగ బయలుదేరవచ్చును. నేనా జ్ఞానమూలమున తనివి దీర్చుకొంటిని, గనుక మిమ్మందరను గూడ నటకు గొనిపోవఁ గుతూహలపడుచున్నాను. మీరటకు బోయి యా సామ్రాజ్యమునందలి శీతల ఛాయలలో నుల్లాసముగ సంచరింపఁ గలిగినపుడే, యితరులనుగూడ నచ్చటకు గొనిపోవఁ గోరుదురు.

---

# VII

## మహాపురుష సాంగత్యము

ఆనంద సామ్రాజ్యముయొక్క ప్రాశస్త్యమును గురించి శ్రద్ధవహించి తెలిసికొనుట బహుముఖ్యమని మీకు నొక్కి చెప్పఁ గోరుచున్నాను. మీ మాటలవలనను, మీరు మాటలాడు తీరునుబట్టియు, మీ రా సామ్రాజ్యముననున్నదియు లేనిదియుఁ గనిపెట్టవచ్చును. మన మా సామ్రాజ్యములో నిరంతరముగ నుండునదియు లేనిదియు చూచుటకు మిమ్ముల నన్నును పరిశీలించి చూచితిని. మన చిత్తవృత్తివలనను, మన జీవిత చర్యలవలనను, పైకి యుబికివచ్చు కోరికలవలనను, మన మా సత్యనిలయమున కెంత దూరముగ నున్నది, లేక యెంతవర కందులో నివసించి యున్నది తెలిసికొనవచ్చును.

మీ రా సామ్రాజ్య నివాసమునకై ప్రయత్నించుచున్న యెడల, నతి సులభముగ మీ మీ స్వంతకష్టములను తరించి, మీ మీ ప్రత్యేక భారములను, మీ మీ ప్రత్యేక స్వభావములను మఱచి, లోకముయొక్క దుఃఖములను, లోకముయొక్క కష్టములను మీవిగఁ జేసికొందురు. మీ రా సామ్రాజ్యములోనే యున్నప్పుడు మీనుండి మీ దినచర్యలను వేరు చేయఁజాలరు; ఆ సామ్రాజ్యములో నుండియే మీ మనోవాక్కాయిక కర్మలనన్నిటిని చేయుదురు కనుక మీ రా సామ్రాజ్యమును మీ చర్యలద్వారా కనపరతురు.

ఆ సామ్రాజ్యము నొక్కసారి మెఱపువలెనైనను గాంచినవారు ఇతరులకంటె నెంత భిన్నముగా నుందురో మీరే చూడవచ్చును. ఎంత సుఖ

ము ! ఎంత సమత ! వారికి మితిమీరిన రాగద్వేషములుగాని, అతియగు బుద్ధికుశలతగాని యుండవు; వారి చిత్తవృత్తివలనను, కేవలము వారి చుట్టును ఆవరించియుండు వాతావరణము వలనను, వారికా సామ్రాజ్య వాసమనదేమో తెలియునని కనిపించును. ధ్యాన సమయముననూ, ఏకాంత మునను, ఇట్లెప్పుడో యొకప్పుడుమాత్ర మా సామ్రాజ్యమందు మనము నివసించఁగలిగితి మేని అది బహు సంతాపకరము. మీ జీవితమంతయు నానందముతో షాంగి షార్లుచున్నప్పుడే, మీ రా సామ్రాజ్యములో నుండఁగలుగుదురు. ఆ యానందము మీ ప్రతిభావములోను, మీరు ప్రతిదినముచేయు పనులన్నింటిలోను, వ్యక్తము కావలెను. కాని చిన్న పురుగు నేడు కొంచెముసేపుండి మాయమయిపోయి, తిరిగి రేపటి దినముపుట్టి వచ్చులాగున, దినమున కొక్కసారి కొన్ని నిమిషములు మాత్ర మందుండినఁజాలదు. మీ రందరు చేయుచుండునది యదియే. మీ మనోభావము లన్నిటిని, మీ చిత్తవృత్తియొక్క తీరునంతను వెల్లడిచేయుటకు మీ రాడుమాట యొక్కటి చాలును. వ్యర్థప్రయత్న ములు చేయుటకంటె, నిరర్థకముగ ప్రయాసపడుటకంటె, గంభీర ముగను, ఆనందముగను, ఉండుట యెంతయో ముఖ్యమని నాకు తోచు చున్నది. విశేషాధికారముగల యెవరో కొందరుమాత్రమే యీ సామ్రాజ్యమున నివసింతురనియు, ఇతరులుండఁ జాలరనియు, ననుకొన వద్దు. ప్రయాసపడువాడు, ఉదారమనస్కుడు, ఉదారహృదయుడు, ఒక్క డెవ్వడైన నున్నయెడల, వా డా సామ్రాజ్యవాసము చేయు చున్నవా డనియే యనుకొనుడు.

మన మీ "ఎర్డా" నిలయమును, మరియు లోకమునంతయును, వాస్తవమైన ఆనంద సామ్రాజ్యముగ మార్చివేయవలెను. మీ రందరు దీనియందు వసింపుచున్నారు గనుకను, మీరు దీనిని సృష్టించుచున్నారు గనుకను, మీరు దీనికిఁ దోడ్పడవలె. అందులకై మీ మీ సామర్థ్య

ములను, మీ మీ సంతోషములను, మీ మీ ఆనందములను మీ రొసంగవలయును. ఈ నిర్మాణమునకుఁ గావలసిన సామగ్రిని మీ రొసంగవలెను. ఎవరో యొక్కరు మాత్రముగాదు; ప్రతివారునుగూడ సహాయులు కావలెను. అందులకై మీ రందరు నుదార స్వభావులుగ నుండవలెను. అందరును ఆ సామ్రాజ్యములో నివసించుచుండవలెను. ఆ వాయువునే పీల్చవలెను. అట్లుండుట కాటంకములగు అడ్డులను, మన చిత్తవృత్తియందుండు క్షుద్రలక్షణముల నన్నిటిని నాశన మొనర్చ వలెను. ఆహా! అది యెంత హర్షోత్పాదకముగ నుండునో, యెంత సంతోషదాయకమో, యెంత యుత్సాహకరమో, మీ రెరుగరు. మీరు చూచు సినిమా ప్రదర్శనముల కంటెను, లోకమునందలి యాటలన్నిటికంటెను, అది సంతోషకరముగను, నుత్సాహకరముగ నుండును.

మనమందరమును దేవతలమని యొక్కక్షణము భావించిచూడుడు. అప్పుడు మన మా మహనీయునితో సమానముగ నొక పంక్తిని కూర్చొనఁ గలము. మనము శ్రీ బుద్ధదేవునివలెను, ఆయన శిష్యులవలెను ఉన్నయెడల, మన మేమిచేయగలమో, మన కెంత ప్రయోజనకరమో యోచించి చూడుడు. బుద్ధదేవుడు మహామేధావి. తక్కిన మనుజు లందటికంటెను గొప్పవాడు, ఆయన శిష్యులు మేధావులు. వారి కాల మున వారు గొప్పవారు. ఆ తేజశ్శాలురును ఆ గొప్పవారును పుట్టిం చిన మనోహర వాతావరణము ఇట్టిదని యూహించుడు. ఇక నావలి వైపు తిరిగి, అక్కాలమున లోకమున నున్న దుర్మార్గములన్నియు మూర్తీభవించియుండిన వారల విజృంభణ మెట్లుండి యుండునో యోచింపుడు. దేవతలు చేయుపనులను వారు నిర్మూలముగావించి, యల్లకల్లోలము చేయుటకు ప్రయత్నించుచుందురు గదా. ఈ రెండు తెగలవారికిని మధ్యస్థులముగనున్న మనబోంట్లు లోకములో చాల

మంది యున్నాము. మీయొద్ద నమూల్యమగు నొక కలశముగాని, మణిగాని యున్నయెడల, దానిని దాచుటకై యొక యినుపపెట్టె గావలెను. వారు నచ్చుట యథార్థము. ఇప్పుడు ఆయన మనతో గూడ నుండుటయు యథార్థము. ఆయన వచ్చినప్పుడు, అట్లు ఆయన మనతోగూడ నున్నప్పుడు, మనము గొప్పవారమై యుండవలెను; మనలో ప్రతియొకరును పరిపూర్ణమగు నుత్తమావస్థ నొందుటకై ప్రయత్నించవలయును. అప్పుడు మనమందర మొక్కచో సమావేశమైన యెడలఁ గలుగు సంతోష మెంత తీవ్రముగ నుండునో యోచించి చూడుడు. ఏలయన, మన మా సమావేశములో మహనీయులతో, గొప్పకళాప్రవీణులతో, గొప్ప స్రష్టలతో, పరిపూర్ణ సౌష్ఠవముగల దేహములతో నుండు దివ్యపురుషులతో, సహవాసులమై యుందుము. ఉన్నతాభిప్రాయములుగల నుదారపురుషుల సహవాసముకంటె, అంతరంగతత్త్వమును మరుగుపరచు వెలుపలివేషములు మాత్రముగాక, కేవల ధర్మసత్యస్వరూపులైన వారి సాంగత్యముకంటె, లోకములో నద్భుత మేమియున్నది!

ఆనందమును రుచిచూడనివాడును, కష్టముల నెరుగనివాడును, అనుభవములు పెక్కులు కలుగనివాడును, మాత్రమే మహాపురుషుల సాంగత్యమును బడయఁజాలనివాడు. వాడు మహా పాపుల సహవాసమునఁ గూడ నుండజాలడు. అట్టివాడు పరులకు సహాయము చేయఁజాలడు; శాశ్వతమగు నానందమును తా ననుభవించఁజాలడు, ఇతరుల కొసంగఁ జాలడు. అట్టివాడు సుందరమును, రమ్యమునైన దానికిని, మోటును, అందవికారమునైన దానికిని గల భేధము నెరుగడు; కనుక వాని యభిప్రాయములు నిరర్థకములు. అట్టివాడు స్వతంత్రముగ సృష్టిచేయఁ జాలడు, సంహారము చేయఁజాలడు, సామాన్య అల్పజనులయొక్క చంచల చిత్తవృత్తులకు లోబడి కొట్టుకొని పోవును.

అయితే ఈ సామాన్య అల్పజన లోకము లోనివారు కాకుండ వలయు ననియే మీ కోరిక. కనుక మీరుచేయు ప్రతియాలోచనయును మీ రనుభవించు ప్రతిభావమునుగూడ చాలముఖ్యములని మనస్సులో నుంచు కొనవలెను. కనుక, మీ స్థూలశరీరము లతి సుందరములుగా నుండునట్లు, మీ భావము లతి నిర్మలములుగ నుండునట్లు, మీ మనస్సు పరిపక్వ మగునట్లు చేసికొనవలెను. ఏలయన, మీశరీరములు, భావములు, మనస్సు, పరిశుద్ధములుగ నుండని యెడల, మహనీయుల సన్నిధియం దుండు ప్రశాంతికిని, శోభకును మీరు భంగము గలుగఁజేతురు; మీరు బుద్ధిమంతులవలె మాట్లాడవచ్చును, కాని మీ ముఖవైఖరి, మీ దేహాత్మస్వభావము, మీ యంతరంగ పరిపాకమునందలి లోపములను వెల్లడిచేయును.

ఇంతయేగాక, మీ రత్యంత పరిశుభ్రతయును, అత్యంతమగు నారోగ్యమును సమకూర్చుకొనవలెను. ఇది యెంతముఖ్యమో, పరిశుభ్రత, ఆరోగ్యము, ఎందులకు కావలయునో, ఒక యమూల్యరత్నమును గురించి జాగ్రత తీసికొనునట్లు వానివిషయమై యంతజాగ్రత యెందులకు తీసికొనవలెనో మీకే తెలియఁగలదు. మీ భావములును, తలంపులును గూడ పరిశుద్ధములును ఆరోగ్యములునై యుండవలెను. కలుషములగు తలంపులు గాని, భావములుగాని, మీ మిత్రులకును, ఇరుగు పొరుగువారలకును కనబడకుండ నెంత దాచిపెట్టుకొనినను, మీ చూపులలోను, మీ మాటలలోను, మీ వైఖరిలోను, జీవితమును గురించి మీకు గల యభిప్రాయములలోను, అది వెల్లడియగును. నేను, తరుచుగ, మనుష్యుల ముఖములను, చేష్టలను, మొత్తముమీద వారి వైఖరినంతను, కనిపెట్టి చూచుటగలదు. సాధారణముగ నెవ రే రకము వారో గ్రహించఁగలను. బాహ్యలక్షణములు యథార్థసూచకములు కావనియును, వానినిబట్టి యెల్ల వేళలను యథార్థమును గనిపెట్టఁజాలనని

యును నే నెరుగుదును కాని, సాధారణముగ నవి లోపలి స్వభావ మును బయలు పెట్టును. కనుక మీ రానందసామ్రాజ్యమును బొంది, యందు శాశ్వతనివాసము చేయవలెననిన, మీ శరీరమును, మనస్సును, ధ్యానములను పరిపక్వములు గావించుకొనవలెను.

కారణములేక, సంగతి తెలిసికొనక, యితరుల ననుసరించి, వా రొసంగు అచ్చులలో నమరిపోరాదు. ఎల్లప్పుడును చలించుచు, నల్ల కల్లోలముగనుండు సముద్ర మేదైన నొక అచ్చులో నిముడునని యూహింపఁగలరా ? అది అచ్చుల నన్నిటి నతిక్రమించును. ఏదియును దానినిపట్టి యుంచఁజాలదు. ఏదియును దానిని బంధించఁజాలదు. ఏదో యొక రూపము ననుసరించుట యతి సులభము, అతిసుఖము. విశేష ప్రయత్న మక్కఱలేదు. కనుక మనమేదో యొక రూపము ననుసరింపఁ గోరుదుము. ఈ రూపతృష్ణచే బద్ధులుగాక, హద్దులేని యీ సామ్రాజ్య ములో, ఈ యానందములో వసించువారికి, మితిలేని యీ విస్తారమే సార్థకమును, రమణీయమునగు పదార్థము. మీరు నిజముగా మహా పురుషుల సన్నిధిని వసింపవలెనని కోరుదురేని, బంధించుటకు సాధ్యము గాని, హద్దుపెట్టుటకు వీలులేని చిత్తవృత్తిని కలుగఁజేసికొనవలెను. మీరు సంతతము నా సామ్రాజ్యములో వసించుచున్నట్లును, సంతతమును మహాపురుషుల సాంగత్యమున నున్నట్లును, భావించుకొనుచున్న యెడల నెంత హర్షముతో—ఎంత హెచ్చుతగ్గులు లేని హర్షముతో నుండఁ గలరో చూడుడు. ఒక మహాపురుషునితో, నొక మహా విజ్ఞానితో, కేవల మా యానందసామ్రాజ్యము ఎవ్వనియందు మూర్తీభవించిన దో యట్టి పురుషునితో, మీలో నెందరు గలసియుండగలరు ? బహు కొద్దిమంది, నిశ్చయముగా బహు కొద్దిమందియే సుమా ! ప్ర పంచమంతయు నాయనకు తోడై, ఆయనతోఁ గలసి పనిచేయుచు, ఆయనతోఁగలసి యానందించుచు నుండుటకు బదులుగ నే యిద్దరు

ముగ్గురో ఆయనకు సహవాసులుగ నున్నారనిన, ఆయన మనస్సున కెంతకష్టమో, ఎంత బాధకలుగునో చూచితిరా?

యథార్థమగు ననురాగమువలన, చక్కగ సరితూగునట్టి యనురాగము వలన నెంత బలము, యెంత ప్రాణశక్తి, గలుగునో మీకుఁ దెలియదు. కనుక, ననురాగమును గూర్చి గూడా సంభాషించఁ గోరుచున్నాను. సరితూగునట్టి యనురాగమని చెప్పితిని. ఏలయనగా, సాధారణముగా, విశేషమగు ననురాగ స్వభావముగలవారు బలహీనులుగను, నిగ్రహము లేనివారుగను, సమత్వము లేనివారుగను, ఉందురు. ఈ రాగభావములు నీరువంటివి. నీటి నెక్కువగా ప్రవహింపఁజేసినయెడల అది వఱదయై, గట్టులపైని పొరలి పారును. దానివలన శాశ్వతమగు ప్రయోజనముండదు. అందువలన ననురాగమున సమత యుండవలయును. కేవలము ఔత్సుక్య మాత్రముగ చూపఁబడు ననురాగముగాక, చక్కగా హెచ్చు తగ్గులు లేక ఉండు అనురాగము, ప్రేమయనబడు నా సనాతనవస్తువు, మీకు కలిగినయెడల, నీ భిన్నాత్మభావము పోవుట కారంభించును. పొంగి పొంగివచ్చు ననురాగము, వికసించునదియు, నిరంతరము వృద్ధి నొందునదియునగు ననురాగము, మీలో ప్రతివానికి నెప్పుడో యొకప్పుడు కలిగియుండవచ్చును. అది క్రమముగా విరివియై, తుదకే కొద్ది మంది మాత్రమోగాక, మీతోడివారందరు గూడ మీ ప్రేమ కాస్పదులగుదురు. అట్టి యనురాగమువలన, దుఃఖముల కన్నిటికి మూలమైన యహంకారమును మీరు మరచిపోదురు, నశింపఁజేసి కొనుదురు. అందువలననే, యట్టి మహత్త్వము లేనివారు, అహంభావపూరితులై, పదరుబోతులై, యితరులపని కడ్డుపడుచు, అధికప్రసంగములను జేయుచు, నిజముగ దేవతాస్వరూపుడగు ఏ గొప్పమనుష్యుడును కలలోనైన జేయని యల్పకృత్యములను జేయుదురు. మీరు మీలోని అహంభావమును మరచి, విశ్వమంతటి యొక్క మహదాత్మతో తాదాత్మ్య మొం

డిన యుత్తరక్షణముననే, యానంద సామ్రాజ్యమున వసించువారై, మీతో పాటచ్చట వసించుటకు లోకమునంతను గొనిపోఁగోరుదురు.

ప్రస్తుతమున మీలో ప్రతివారును, ఏదేని యొక సత్కార్యమును నెరవేర్చినా రనుటకంటె, జ్వరజనితమగు వేగమువంటి ప్రయత్నమును మాత్రము చేయుచుంటి రనవచ్చును. ప్రయత్నములను చేయుచు కొట్టుకొనుచున్నారు, కాని గమ్యస్థానమును బొందలేదు. మీరు భీరువులు. సాహసించరు. సముద్రములోనికి ఉరకరు. బిడ్డలు సముద్రతీరమున నిలిచి, మెల్ల మెల్లగా నొక్కపాదముతో నీటినితాకి, చల్లనినీరు తగులగనే పాదమును వెనుకకు దీసికొందురు. మీరు నట్లేచేయుచున్నారు. సముద్రములో జారిపడినను కొఱవగాదు, తిరిగి లేవవచ్చును. సముద్రములోఁ జొచ్చి యీదుచు బోయినయెడల నావలితీరమును జేరవచ్చును, కాని దినమంతయు నొడ్డున గూర్చొని, యటకు బోవుదునా మానుదునా యని సంశయించుచు నుండరాదు. మీయంతరంగ వాక్కు ఆజ్ఞాపించుచున్నది, గనుక నీటిలో దుముకవలెను. ఆ వాక్కు మీకు వినబడనియెడల దినమంతయు వ్రణపీడితులవలె బాధపడవలెను. ఆ వాక్కు మిమ్మలను ముందుకుఁ బొమ్మని తొందర చేయనియెడల, నొక్క క్షణమైన నూరకుండరాదు; ఒక్క క్షణమైనను శాంతముగను, నిశ్చలముగను సంతోషముగను ఉండరాదు. మీరన్ని వస్తువులకు మూలమైన స్థానమును జేరవలెను. ఒక్కసారి యా మూలమును జేరినయెడల, మీరే యాదైవముగను, ఆ మనుష్యాతీతుడుగను, ఆ జీవన్ముక్తుడుగను నగుదురు.

బుద్ధదేవుడు, క్రిస్తుప్రభువు, మొదలైన జగద్గురువులందరును జీవితమూలమును బొందినవారు. వారందరును లలితకళా పరిపూర్ణులయిన జీవన్ముక్తులు. ఆ మూలతత్త్వముయొక్క స్వభావమును పరమమహత్తును తెలిసికొన్న వారగుటచేత, వారు తామే యా మూలము, మార్గము, జ్ఞాన

ప్రేమల మూర్తులు, నైరి. జీవితోద్దేశ మిదియై యుండవలెను. మీ రందరు, బుద్ధదేవులును, క్రైస్తు ప్రభువులును గాఁజాలరు; కాని యం దరకును వారివలెనే స్వప్నములు, వాంఛలు, కుతూహలము, తీవ్ర ఆశ యములు ఉండఁదగును.

ఆ పరమపురుషుల సామ్రాజ్య మాహాత్మ్యము నొక్కసారి గ్రహిం చిన యెడల, ఆ మాహాత్మ్య దర్శనము వ్యక్తమగుటకు సృష్టియందు ఏమార్గము అనుకూలమో ఆ మార్గమును మీయంతట మీరే నిర్ణయించు కొనఁగలరు. అప్పుడు మీరత్యుత్తమ గ్రంథకర్తలలోను, ఉత్తమ లలిత కళాప్రవీణులలోను, గొప్ప ప్రకృతి శాస్త్రజ్ఞులలోను అగ్రేసరు లగుదురు. అప్పుడు మీకు పండిత వాక్కు గలుగును. అక్కడనే, లోక ములో నెల్ల వాంఛనీయమగు నాధ్యాత్మికోత్సాహమున్నది. మీరు స్వతంత్రులై యుండవలెను; సంకల్పభావముల స్వాతంత్ర్యము మాత్రమే గాక, భూలోక విషయముల యందెందును చిక్కుకొనక, మీకు స్వతం త్రము రావలెను. ఉత్తమోత్తమమగు నానందమును బొందుటకు, ఇదియే మార్గము. అనగా మానసిక సంబంధమును, భావసంబంధమును; స్థూల వస్తు సంబంధమనగు పరిపూర్ణ స్వాతంత్ర్య ప్రాప్తియే. ఇది యొక్క టియే యానంద సామ్రాజ్య వాసమునకుఁ ద్రోవ.

---

# VIII

## సృష్టికర్తయైన మనస్సు

మనస్సు భగవత్తత్త్వముయొక్క సారము. మనస్సు సృష్టినిగాని నాశనమును గాని చేయగలదనుట స్పష్టము; అది మన గమ్యస్థానమును జేరుటకు మనలను ప్రోత్సాహించు రాగభావములను స్వాధీనము జేసికొని వానిని నడుపును; మనస్సు సత్యమును స్వతంత్రముగానే దెలిసికొనఁగలదు; సత్యమునుఁ దెలిసికొని, మనస్సట్లే స్వతంత్రముగ నా యానందసామ్రాజ్యమున నివసించఁగలిగి యుండవలెను. సుశిక్షితమగు మనస్సును, నైజమగు తెలివియును, లేనియెడల మనము మన గమ్యస్థానముచెంతఁ జేరజాలము. మరియును, మన దృష్టి నల్పముగఁ జేయునదియును మనస్సే; ఉపాధులను కాక్షించి, యారూపములలోఁ బ్రవేశించఁ గోరునది మనస్సే; వస్తుజాలమునుభావించు స్వభావము గలది మనస్సే. మీ మనస్సులయం దీ లక్షణముగుఱించి హెచ్చరికతో నుండవలయును.

మనము చేయుపనియే సరియైనదనియు, మన మనుసరించు మార్గమొక్కటియే నిజమైన మార్గమనియు, మనమెంచుకొనిన యాలయమే, మనము పూజలుచేయు వేదికయే, మనమవలంబించు పూజావిధానమే, మనమాచరించు కర్మయే, మనము కల్పించు బాహ్యస్వరూపమే, యథార్థమైనవనియు, అవిమాత్రమే భగవచ్ఛక్తులు బహిర్గతము లగుటకుఁ దగిన కాలువలనియు, తఱుచుగ మన మనుకొనుచుందుము. అనగా మనమితరులను జూచి, “మీరు చేయునది తప్పు, నన్ననుసరించి,

నేఁ జేసినట్లు జేసి, నేఁ దలచినట్లు దలచినయెడల మీరు చేయుపని సరి" అని చెప్పుదుము. మీరందరు నట్లే తలచుచున్నారు. మీలో ఆనంద సామ్రాజ్యమును బ్రవేశింప యత్నించు ప్రతివాని మార్గమునకు నిదియే యాటంకమై యున్నది. ఆ సామ్రాజ్యములో నట్టి క్షుద్రమగు నేక రూపత యుండదు; అచ్చట ప్రయత్నముచేయువా డెవడైనను, ఉదార జీవితము జీవించువా డెవడైనను, సహజ సుందరములైన మనస్సు, హృదయము గలవా డెవడైనను, సకల భూతములతో నొక టిరై యుండఁగలడు; ఉండును. మన కీ జీవితములో నతి ముఖ్యమైన దీ యేకత్వ భావమే; ఆకలిగొన్నవారికి మన మీయగల యాహార మదియే; జీవిత సమస్యలకన్నిటికిని సమాధాన మదియే. "నీవు స్వతంత్రముగ ననుసరించునది తప్పుమార్గము; నన్ననుసరించి, నా యంతరంగ జ్ఞానమును, నాగురువును, నా యిష్టదైవమును, అనుసరించిన యెడల నదియే సరియైన మార్గము" అను నసహిష్ణుత పరమార్థగతికి విరుద్ధము. ఉత్సాహ మున్నయెడల, (జీవితసాఫల్యసాధనమగు) దివ్యమగు అసంతుష్టి లేశమైన నున్నయెడల, ఆనందమునకై కాంక్ష యున్నయెడల, ఈ మాయా సంసారమునుండి తప్పించుకొనుట కపేక్ష యున్నయెడల, నీ వే మతస్థుడవైనను, ఏ మతస్థుడవును గాకున్నను, ఏ తెగకు, ఏ జాతికి, ఏ వర్ణమునకు, ఏ సంప్రదాయమునకు చేరి యున్న వాడవైనను, కొఱవగాదు. ఏలయన, నవి యున్నయెడల నీవు ఆనంద సామ్రాజ్యమునకుఁ గొనిపోవు మార్గమున నున్న వాడవే. మీ రెల్లప్పుడును గమనించదగిన దీ భావ మొక్కటియే.

మీ జీవిత ముత్తమమై యున్నపుడే మీ రీ సామ్రాజ్యమున బ్రవేశించఁ గలుగుదురు; అల్ప స్వభావమునుండి, భేదభావము నుండి తప్పించుకొనుటకు ప్రయత్నించు చున్న యెడలనే, మీ రా సామ్రాజ్యవాసము చేయఁగలరు. అందు కొరకే మీ మనస్సు నిర్మలముగను, పరిశుద్ధముగను,

సర్వమును తన లోపలఁ గలదిగను ఉండవలెను; అట్టి మనస్సు మీ కున్నయెడల భావములుగూడ నట్లే గొప్పవియై, యానందభరితములై, యుండును; అట్లుగాక, నీ వితరులకంటె వేరైనట్లు తలంచి, వారి నందరను బహిష్కరింతువేని, అనగా, నీ కహంభావ మెక్కువయైన యెడల, ఆనందసామ్రాజ్యమును నీవు ప్రవేశించఁజాలవు.

ఒకడు దుఃఖముల పాలై, కష్టదశలో నున్నాడనియు, అంతరంగ మున సుఖము లేక శ్రమపడు చున్నాడనియు, నీకు తెలిసిన యెడల, వానికి శ్రమతీర్చుటకును, వానికి మనశ్శాంతి నిచ్చుటకును, నీ వొసంగఁ గల యౌదార్య వచనము నీవు రుచిజూచిన యీ యానంద సామ్రాజ్య మొక్కటియే; నిత్యవస్తువులను గనుకొనుటచే నీకు గలిగిన హర్షానుభవ మొక్కటియే. ఈ యానందమును నేను మీ కొసంగఁ గలుగుదును గాక యని యెంతయు కుతూహల పడుచున్నాను. ఏలయన, దానిని మీ రితరుల కొసగి, దాని యపరిమిత యాథార్థ్యమును వారు భావించు నట్లు జేయఁగలుగుదురు గాకయని నాకోరిక. మీ రానంద సామ్రాజ్య మునఁ బ్రవేశించి యచట వసించియున్నపుడే, యాకలిగొన్నవారి కాహార మిచ్చుటకును, బాధపడు వారి బాధ నుపశమింపఁ జేయుటకును, దెబ్బ తగిలిన యాత్మకు మందువేయుటకును, మీకు సాధ్యమగును. కనుక, మిమ్మల నా సామ్రాజ్యమునకుఁ దోడ్కొని పోఁగోరుచున్నాను.

ఆ సామ్రాజ్యములో మీ యిష్టానుసారముగ మీరు జీవించవలెను; మీ యంతరంగ వాక్కునే మీ రనుసరించవలయును; మీ స్వంత గురువును మీరు కనుగొనవలయును; మీ జీవితార్థమును మీరే కని పెట్టవలెను. మీకుఁ గలుగవలసిన తీవ్రేచ్ఛ యదియే. ఏలయన నపుడు మీరు పూర్ణులగుదురు. అప్పుడు మీ యాత్మ, మీ దేశము, మీ మనస్సంతయు, మీ హృదయమంతయు, నా సనాతన తత్త్వముతో పూర్ణముగ నిండియుండును; గనుక, మీరు లోకముతో సంబంధించిన

వారై, లోకమునకు సహాయము చేయఁగలరు. ఆ సహాయము చేయుటలో నించుకయైనను వెనుదీయక, సందేహించక, చేయఁగలుగుదురు. మీరు పరిపక్వము నొందిన కొలదియు, ఈ మనోవృత్తి మీ కభ్యాసము గావలయును. మీ రితరుల కానందము నొసంగినంగాని, మీ కానందము గలుగఁజాలదు; మీ రా సామ్రాజ్యములో ప్రవేశించి, యా సనాతన వాక్కు ననుసరించి, దాని యేకాంత ధ్వనిని వినినప్పుడే మీ రితరుల కానందము గలుగఁజేయగలరు. మీ రా విధముగనే ఇతరులకు త్రోవచూపి, వారల కానంద మొసంగగలరు; ఆ విధముననే వా రౌదార్య స్వభావముకొరకు ప్రయత్నించునట్లును, వారి యంతరాత్మచే సూచింపఁబడు దివ్యవాక్యములను వినునట్లును, ప్రోత్సాహము నొసంగఁగలరు. దీనికై పాటుబడుటలో బాధగలుగును. అయితే శ్రమయంతయు, బాధయంతయు, కార్యసాధన మార్గములో నొకభాగమే. ఆ కార్య మెద్దియన ఆనందమును గనుటయే. పర్వతముల మీద నుండు నదియును, ఆ నిత్యతత్త్వజ్ఞానముతో మైమరచునట్లు చేయునదియును, ఒంటరిగ నిలుచుట కత్యంతమగు బలము నొసంగునదియును, నగు నున్నతోన్నత పర్వతవాతావరణ మిదియ.

బయలులోనున్న మ్రానుకంటె పర్వతశిఖరముపైనుండు మ్రాను సహజముగ నెక్కువ బలముగలదిగా నుండును. అట్లుండక తీరదు. ఏలయన దానికి లోకములో వీచు వాయువులన్నియును దగులును. అది బలమైన పెనుగాలిదెబ్బలకు నిలువవలయును గనుక, దాని వ్రేళ్లు మిక్కిలి లోతుగఁ బాతుకొనును. అది ఆకసమునకు సమీపముగ నుండుటచేత నెక్కువ ఠీవిగను, ఎక్కువ గౌరవముగను, ఉండును. ప్రభాతకిరణములు మొట్టమొదట దానికి తగులును. అది నక్షత్రములకు దగ్గరగనుండును. ఆ నిత్యతత్త్వమునఁ బ్రవేశింపగోరుదురేని, యా చెట్టువలెనే మీరును ఉండవలెను. మీరు దేవత్వమునకు సమీపమున

నుండుటచే లోతుగ ద్రవేళ్లుబారి యుండవలెను; సూర్యకిరణములు మీకు మొట్టమొదట కనిపించును గనుక మీ రెదుగుటకై గాఢతరమగు బాగలను బడవలెను. మీరా యున్నత స్థానమున నున్నపుడు, ఈ క్షణికములును, అశాశ్వతములునగు వస్తువులు మాయ యనియు, నిరర్థకములనియు మీకు తెలియును. ఆ పర్వతశిఖరమున పరిశుభ్ర వాయువులో సంతతము నొంటరిగ నిలచి దిన దినమును బలమున పెంపొందుచు, ఆ పర్వతము నశించిననే క్రిందపడు నా వృక్షమును తలంచుకొనినయెడల ఆ భావము నాకు బలము నిచ్చును.

ఆ మహనీయుడు మనకొసంగు చిత్తవృత్తి యిదియే; ఆయనను తెలిసికొనుటకు మన కుండవలసిన చిత్తవృత్తి యిదియే; మన కుండవలసిన యానందము, దృఢనిశ్చయము నదియే; ఆయనను మన హృదయములలో నిలువఁబెట్టుకొనుటకును, ఆయనను మన మనుసరించుటకును మార్గ మది యొక్కటియే; మన మితరులకంటె భిన్న మని యెంచుకొనము గనుకను, మనము అల్ప సంప్రదాయములకు చెందియుండలేదు గనుకను, మన మా సత్యతత్త్వ మనియెడి నీటి బుగ్గలోని నీరు గ్రోలితిమి గనుకను, మన మచ్చటనుండి, యాకసము నంట సమర్థులమై యుండుట వలనను, ఇతరులుగూడ మనమున్నచోటికి వచ్చి మనతోపాటు శాశ్వతానందము ననుభవింపవలయునని కోరుదుము.

తెలివిగలవాడు, సుఖియగువాడు, కష్టపడుచున్నవాడు, ఎవడైనను అంగీకరించఁగలదియు, అంగీకరించ వలసినదియు నగు సత్య మదియే. ఆ స్వానుభవజనితమగు జ్ఞానము నీకున్నయెడల, మనుజులకు విశ్రాంతి నొసంగునదియును, నిత్యముగ నుండునదియును, ఆనందసామ్రాజ్యములో మాత్రమే పెరుగునదియు, నగు నామహావృక్షమువలె నీవు కాఁగలుగుదువు.

ఆ యెత్తున కెగురుటకు మీకు రెక్కలు కావలెను. ప్రతిదినమును క్రొత్తరెక్కలు పెంచుకొనవలయును. క్రొత్తరెక్కలు పెరుగవలె

ననిన మీరెల్లప్పుడు నున్నత శక్తులకై పైకెగురుచు, వృద్ధిపొందుచు,
పెరుగుచు, ప్రయత్నించుచు నుండవలెను. అనగా, ప్రతిదినమును
మీరు మారుచుండవలెను. మీ మార్గమున కాటంకములగునవి,
మిమ్ములను నిర్బంధించునవి, మీకు పరిపూర్ణ స్వాతంత్ర్యము
నొసంగనివి, మాయసంసారమునకు మిమ్ములను బంధించియుంచునవి,
యగు వాని నన్నిటిని మీరు విడిచిపెట్టవలెను. పెరుగుటకును, క్రొత్త
శక్తులను, క్రొత్త సుఖములను పొందుటకును అదియే మార్గము. క్రొత్త
రెక్కలున్ననే మీరా యున్నతస్థానముల కెగురఁగలరు.

ఎల్లపుడును మీరు ప్రేమను ప్రసరించుచుండవలెను; ప్రతివాడును
ఆ సామ్రాజ్యమున నుండవలెనని మీరు గోరుచున్నారు గాన మీ
చుట్టునున్న ప్రతివస్తువును గూడ ఆ సామ్రాజ్యములోనికి గొని
రావలెనని మీరు కోరుచున్నారు గావునను, సమస్త ప్రాణులును,
సమస్త చరాచర భూతములును, మీ ప్రేమను ఎక్కువగ బలపరచు
కొనుటకు మీకు ప్రోత్సాహము నొసంగవలెను. ఇట్లు ప్రతివారును
ఈ యానందసామ్రాజ్యమును లోకమున విస్తరింపఁజేసినపుడు, బాహ్య
రూపములు తత్త్వతః నిరర్థకములనియును, మీ రితరుల నా సామ్రా
జ్యమునకు జేర్చుటయే మీ వలని ప్రయోజనమనియును మీ రెఱుంగ
గలరు. అందువలననే, నేను కనుగొనిన యీ యానందములో కొంత
గాని, యంతెగాని, మీ కొసంగఁ గలిగినచో నెంతయో బాగుగ
నుండును. నే నొక్కసారి యీ యానందమును చవిగొంటిని గనుక,
తిరిగి చవిగొనగలను; ఒకసారి యీ యానందమును ప్రత్యక్షముగ
నెరింగితిని గనుక, తిరిగి దాని నెరుంగగలను. దాని యతిశయమును, దాని
లావణ్యమును ఎరుంగనివాడు, జీవితముయొక్క శోభను, మహిమను
తెలిసికొనఁజాలడు. ఒక్కసారి దీనిని రుచిచూచినవాడు, అనిత్యము
లగు వస్తువులతో నెన్నడును తృప్తి పొందఁజాలడు. అందువలననే, నా

యానందమును మీ కొసంగి, మీకు దానిని రుచిచూపి, ఆ వాయువును మీరును బీల్చునట్లు చేసి, నా సామ్రాజ్యములో మిమ్ములను వసింపఁ జేయవలెనని కోరుచున్నాను.

అందు కొఱకై మీరు మేల్కాని, మీ యాత్మద్వారములు, కిటికీలు, అన్నింటిని తెరచి, యీ జీవితములోని ఏకమగు సత్యము నన్వేషించుటకు బయలుదేరుడు. నిరర్థకములును, జ్వరోద్వేగజనితములు నగు ప్రయత్నములలో మునిగి, చీకటి గొందులలోఁబడి దారితప్పి పోక, వెలుతురుగల స్థలములను, సత్యనిలయమును, ఆనంద సామ్రాజ్యమును వెతికి, యందు మీలో ప్రతియొక్కడును, నివసించవలెను.

మిమ్ములను క్రిందకు త్రొక్కియుంచు నహంభావమును విడిచినవారై, ఆ ఆనందపరవశములో, ఆ యత్యంత సంతోషములో, మీ ప్రబోధ మూలమును కనుగొందురు; మీకుఁ గావలసిన సౌందర్యమును కనుగొందురు; మీరు సంపాదించి విడువకుండ నుంచుకొనఁదగినదియును, ప్రయత్నముచేయఁదగినదియును, సర్వత్యాగముజేసి పొందఁ దగినదియు నగు నేకసత్యమును గనుగొందురు. మీకా సామ్రాజ్యమున ప్రవేశించుటకు అత్యంత ఆశయును, తీవ్రమగు కాంక్షయు నుండవలెను; అవి యున్నయెడల, మీరేకార్యములు చేయుచున్నను, వానియందు నిత్యత్వ చిహ్నము లగపడును; మీ రెచ్చటనున్నను, ఆ సామ్రాజ్య లాంఛనములుగ నుందురు.

---

# IX

## ప్రపంచము పూజాపీఠము

ఒక సత్యమును గురించి, చలింపనట్టియు, సందేహము లేనట్టియు నమ్మక మంతరంగమున గలుగుట యొక్కటియే మనకు లక్ష్యమై యుండవలెనని మీ కందరకును స్పష్టముగఁ దెలిసియే యుండును. ఈ సత్యమును మీ కొకరు విధింపఁజాలరు; మీరే స్వతంత్రముగ దానిని పొందవలెను; మీరు మేల్కాంచి, యంతరంగ వాక్కును వినఁగలిగినప్పుడే, యా సత్యమునుఁబొందఁగలరు. మీరు స్వయముగఁ గనుగొని, స్వయముగ బోధపరచుకొనిన సత్యమునుండియే, మీరు చేయుపను లన్నియును, మీరు తలంచు తలంపు లన్నియును, మీకుఁ గలుగు నభిప్రాయము లన్నియును పుట్టవలెను. అట్టి సత్య మితరులతో పాల్గొనుటకుఁగాని, ఇతరుల కిచ్చుటకుఁగాని, సాధ్యముకాదు. సత్యమును ప్రతివాడును స్వయముగఁ గనుగొనవలయు ననియును, ఆ సత్యమును బోధపరచుకొన్న తరువాత, దాని ననుసరించి ప్రవర్తించవలయు ననియును, లోకమున గొప్పయుపదేష్ట లొక్కొక్కరును దృఢముగఁ జెప్పియున్నారు. అట్లు ప్రవర్తింతురేని, మీ రా సత్యస్వరూపులును, సత్యబోధకులును, నిత్యమగు నానందమునకు మార్గదర్శకులును అగుదురు.

ఈ విషయమై చక్కఁగఁదెలిసికొనుటకుగాను, మీరు దాని శాసనముల ననుసరించి జీవించవలెను; ఆ సత్యమునకు తగిన కోరికలు మీకుండవలెను. పుష్పము స్వభావసిద్ధములగు పరిస్థితులలో నెట్లు చక్కఁగాఁ బెరుగునో, మీరును స్వభావసిద్ధములగు పరిస్థితులలో నభి

వృద్ధినొందుటకు మీకు ప్రోత్సాహ ముండవలెను. పుష్పము వికసింపక, మొగ్గగా నున్నప్పుడుఁగూడ కాలక్రమమున ఒకప్పుడు సూర్యరశ్మిని జూచి, స్వకీయ సుగంధమును లోకమునకు వెదజల్లుట తన జన్మ సాఫల్యమని యెరుగును. అట్లే మీరును, అభివృద్ధి నొందుకాలమున, మీరు పూర్ణవికాసము నొందినక్షణముననే మీకు లభించు జ్యోతిని గురించియు, సత్యమును గురించియు, మననము చేయవలెను, ధ్యానము చేయవలెను.

గ్రుడ్డిగా నింకొకరి ప్రమాణమును, ఇంకొకరి సంప్రదాయమును అంగీకరించక మీ యంతరంగ వాక్కును వినినయెడలనే, మీ రా సూర్యకాంతిని, ఆ శక్తిని, ఆ సంతోషమును, అనుభవించఁగలరు. పరుల ప్రమాణమును, సంప్రదాయమును, త్రోసివేయవలెను. మీకు మీరే శాస్త్రకారులుగ నుండవలెను. పూర్వ జన్మములయందును, ఈ జన్మమునందును సంపాదించిన యనుభవములవలనఁ గలుగు మీ స్వాభిప్రాయములును, సహజ విజ్ఞానమును, అనుసరించి మీరు ప్రవర్తించవలెను. ఒకటే ధర్మ మున్నది; ఒకటే నిర్వాణము, ఒకటే యానందసామ్రాజ్యము, ఒకటే సారమున్నది; ఇది మీరు చక్కగా బోధపరచుకున్నయెడల, దాని ననుసరించి ప్రవర్తింతురు. మీ రభివృద్ధినొందిన కొలదియు, ఆలోచన చేయుకొలదియు, కష్టముల ననుభవించు కొలదియు, ఆ మూలవస్తువును, ఆ యేకత్వమును, ఆ నిత్య సత్యమును సమీపింతురు. ఈ సత్యమును స్వయముగ విని, స్వయముగ గ్రహించునంతవరకు, మీ కీ సందేహములు, ఈ వితర్కములు, లోపల నీ మహా యల్లకల్లోలము కలుగక తప్పదు.

మనము బోధపరచుకొనుటకు ప్రయత్నించుచున్నపుడు, బుద్ధిమంతుల కుండఁదగిన మనస్సాక్షి మనకుండవలెనేగాని, బుద్ధిహీనులకుండు మనస్సాక్షి తగదు. జీవితముయొక్క యుత్తమదశను గనుగొన్న

వారి మనస్సాక్షి మనకుండవలెనుగాని, అల్పులయొక్క, స్వాభిప్రాయ ములతో నిండియున్న యజ్ఞానులయొక్క మనస్సాక్షి మనకుఁదగదు. ఇట్టి యల్ప మనస్సాక్షినుండి తప్పించుకొనఁ గోరుదురేని ఆ వాక్కు యొక్క బలహీనములగు గుసగుసలనుండి తప్పించుకొనఁ గోరుదురేని, యానంద సామ్రాజ్యమనగా నేమో, ధర్మమనగా నేమో, సత్యమనగా నేమో పరిపూర్ణముగాఁ దెలిసికొనవలెను.

వర్షము నేలపైఁబడి అన్ని జాతులచెట్లను, అన్ని రకముల మొక్క లను, పుష్పములను, పోషించునట్లు, ఒక్కటియగు నీ మూలవస్తువు ప్రతివస్తువులోను సమముగఁ బ్రవేశించియున్నది. కుమ్మరివాని చేయి మంటికి రూపముల నొసంగి, ఉపయోగకరములును, అందములు నగు పాత్రలుగా చేయును; వానిలో గొన్ని పువ్వులను, అన్నమును, పెరు గును, ఉంచుటకు తగియుండును; కొన్ని యపరిశుద్ధ వస్తువుల కుపయో గించునవై యుండును. అయితే ఆ పాత్రములన్నియు నొకని చేతుల తో, ఒక్క మన్నునుండి, గిరగిరఁదిరుగుచుండు ఒక్కసారె పైని, చేయఁబడినవియే. తత్త్వతః, మనమందరము నొక్కటియే, కాని రూపములనుఁబట్టి భిన్నములుగ నున్నాము. ఆ భేదము ననుసరించి సత్యమును తెలిసికొను శక్తి సైతము భేదముగ నుండును. మీ రెంత యుదారస్వభావము గలవారుగ నున్న, ఎంత ఎక్కువగ కష్టముల నను భవించియుండిన, ఎంత ఎక్కువగ సుఖము ననుభవించియుండిన, మూల తత్త్వముయొక్క యేకత్వమున కంత సమీపముగ నుందురు. ఇది యొక్కటియే ధర్మము, ఇది యొక్కటియే మిమ్ముల నానందసా మ్రాజ్యమునకుఁ దోడ్కొని పోఁగల గురి. రూపములనుఁబట్టి భిన్నములై యున్న యీ వస్తువులన్నిటియందు నొక్కటియైయున్న మూలతత్త్వ ము నెరింగి, ఆ జ్ఞానము ననుసరించి జీవించినవారికే శాశ్వతమగు నా నందము చేకూరను.

అయితే అట్టి జ్ఞానము గలుగుటకు కొంతకాలము పట్టును. సత్య మును బోధపరచుకొనుటకు మీ యిచ్ఛ సుశిక్షితము గావలెను; మిమ్ము లను నడిపించునది మీ మనస్సు గనుక, మనస్సు నుపయోగించవలెను. ఈ మనస్సు మిమ్ములను సరియైన మార్గముననో, తప్పుమార్గముననో నడుపఁగలదు. ఈ మనస్సు దేహాత్మభావమునుండియు, దురభిప్రాయ ముల నుండియు, ఇతరులనుండి మిమ్ములను వేరుచేయు క్షుద్రవిషయము లన్నిఁటినుండియు, మిమ్ములను దూరముగఁ గొనిపోఁగలదు. లేదా మీ రితరులకంటె వేరనుభావమును గట్టిగ పట్టుకొనియుండునట్లు చేయఁ గలదు. విచక్షణజేయగల మనస్సు, అనేక అనుభవములవలనను, త్యాగ ములవలనను సదసద్వివేచనము చేయగల మనస్సు, మీకున్నయెడల, మీ రాయొక్క ధర్మమునే, ఆయొక్క యేకాంత మార్గమునే యవలం బించి పోఁగలుగుదురు. ఆ యానందముకొరకు సర్వమును త్యాగము చేయ నేర్చితిరి గనుక, మీ రప్పుడు నిరర్థక ప్రయత్నములను చేయరు. ఆ యానందమునకు గొనిపోవుమార్గమున నడువవలెనన్న, మీ రాత్మ త్యాగము చేయగలిగియుండవలెను. మీ పక్షపాతములు, మీ దురభి ప్రాయములు, అల్పములును స్వప్రయోజనకరములునగు మీ యను రాగములు, మీ యైహిక బంధములు, వీని నన్నిటిని త్యజించవలెను.

నేను మీతో నమ్మకముగాఁ జెప్పుచున్నాననిగాని, ఏవో కొన్ని పేర్లుపెట్టి నిరూపించుచున్నాననిగాని, ఇతరులు చెప్పుదానిని ప్రమాణ ముగఁ గైకొని దానిపై నాధారపడిగాని, మీ రా మార్గము ననుసరింపఁ దగదు. మీ స్వాభిలాషవలన, మీ స్వంత కాంక్షవలన, సత్యము నన్వేషించవలయునను మీ కోరికవలన, మీ రా మార్గము ననుసరించఁ దగును. పుష్పము వికసించుట, ఆనందముగనుండుట, దాని స్వభావము; మీరును పుష్పమువలె సహజముగ, సుందరముగ, వికసించవలెను. మీరు బాగుగ గమనించి త్రోవచూపి శిక్షించినట్టియు, యుక్తమగు నాహార

ముతో పోషించినట్టియు, మీయిచ్ఛ నుపయోగించిననే మీకు సత్యము లభించును. అట్టి యిచ్ఛ కలుగునంతవరకును, మీరు జయము నొందుటకు బదులు, కృతార్థులగుటకుబదులు, జ్వరోద్రేకజనిత వ్యాపారములవంటి ప్రయత్నములనే చేయుచుందురు; ఆటంకములను దాటుటకుబదులు, క్రొత్త ఆటంకములను కల్పించుకొందురు; పర్వత శిఖరములపైనుండి జయధ్వానముల చేయుటకు బదులు, లోయలలోనుండి విలపించు చుందురు.

లోకములో ప్రతియొకడును ఒకే ధర్మము, ఒకే లక్ష్యము, ఒకే సత్యము, ఒకే ఆనందసామ్రాజ్యము నున్నవని యెరుగవలయును. సకల భూతములయందు నొక్కటియైయున్న జీవచైతన్యమును, ఏకమగు మూలమును ఎరుంగుటయే యా ధర్మము. ఆ ధర్మము ననుసరించి జీవించినయెడలనే మీ రా సామ్రాజ్యమును జేరఁగలరని గూడ నెరుగవలయును. ఈ భావము గలిగియున్నవారికి నిజముగ నేదియును ముఖ్యముగాదను గొప్పభావము కలుగును; నాకేమో యట్టిభావము గలుగును; నా కా భావము అత్యంత నిశ్చయమును, దానినుండి ఆంతరంగికమగు శుద్ధశాంతి నొసంగుచున్నది. ఆ శాంతి చలించదు. దాని నెవ్వరును త్రీసికొనిపోఁజాలరు. క్షణికమగు నసౌఖ్యమువలనగాని, దుఃఖమువలనగాని యది యణచివేయఁబడునదిగాదు; మరియొకనికి నాపై ననురాగము నశించుటవలనగాని, నాపైని లోకులకుగల గౌరవము తగ్గుటవలనగాని యది నశించదు. ఆ శాంతి నా స్వంత వికాసమువలన పూచిన పువ్వము, నేను స్వయముగ చేసిన సృష్టి, నా స్వంత ధనము; కనుక దాని నెవ్వరును నా యొద్దనుండి గొనిపోఁజాలరు. ఒకసారి నీకా శాంతి లభించినయెడల నీకు శక్తి కలుగును, నీ కిష్టమువచ్చిన పనిని నీవు చేయఁగలుగుదువు. నీవు అన్ని అనుభవములను, సుఖములను, దుఃఖములను, అనుభవించితివి గనుక, నీ వొంటరిగనున్నను లోకులంద

రును నీ చుట్టునున్నను, నీవా పర్వతాగ్రమున నుండఁగలవు. ఒకసారి నీ కా శాంతి, ఆ శక్తి గలిగినయెడల నీవు సత్యతత్త్వమై, యెక్కడ నున్నను, సతతము ఆనందసామ్రాజ్యవాసమే చేయుచుందువు.

మీ రెప్పుడైనను విద్యుచ్ఛక్తి నుత్పత్తిజేయు యంత్రశాలకుబోయి, యచట మహావేగముతోఁ దిరుగుచుండు గొప్ప చక్రములను, పనిచేయు పెద్దపెద్ద 'డైనమో' లను (విద్యుచ్ఛక్తి నుత్పత్తిచేయు యంత్రములు) చూచితిరా? అవి కొంతమట్టుకు నిశ్శబ్దముగ నుండును, గాని యెప్పుడును విశేషమైన శక్తిని పుట్టించుచునే యుండును. అట్లే మీరును విద్యుచ్ఛక్తిని బుట్టించు యంత్రములవలె గంభీరముగను, సమత్వము తోడను ఉండవలెను. అయితే మీరు జీవితముయొక్క మూలతత్త్వమును, ఏకత్వమును, ప్రత్యక్షముగఁ దెలిసికొని, యీ మాయనుండి, యీ యసత్తునుండి, తప్పించుకొనిననే, యట్లుండఁ గలుగుదురు.

ఆ విధముగనే మీ ప్రవర్తనము ఉద్దేశ్యపూర్వకమగునట్లు చేయఁ గలుగుదురు. ఆ యర్హతలేనియెడల మన కానంద ముండదు, మనకు పురోవృద్ధి గలుగదు. మీకు జీవయాత్రలో నేదోయొక ఉద్దేశ్యముండవలెను, జీవయాత్రలో శ్రద్ధ యుండవలెను. మనలో పెక్కంద్రము అడ్డుగోడ లనేకములున్న యింటిలో నివసించియున్నాము; మనము వెలుతు రెచ్చటనుండి వచ్చుచున్నదో యా మూలమును జూడఁబోవలయునా, లేక, దాని ప్రతిబింబమును మాత్రము జూచుచు తృప్తి నొంది యుండవలయునా, యని యోచనరైన చేయక యుదాసీనులమై యున్నాము. జీవితముయొక్క ప్రయోజన మిట్టిదని నిశ్చయించుకొంటివేని, యది నీకు మనోనిశ్చయమును, ఇచ్ఛాశక్తియును, గలిగించును. నీవు గమ్యస్థానమును జేరుదువు. మీ నిజస్థితిని మీరు దెలిసికొన్నతరువాత, మిమ్మెవ్వరును ఆటంకపరచఁజాలరు; మిమ్ముమను అలక్ష్యము చేయఁజాలరు, మీ కడ్డులను కలుగఁజేయఁజాలరు. మీరు

స్వతంత్రముగ మీ గమ్యస్థానమును, మీ వేదికను, మీ యాలయమును, జేరినతరువాత, నచట యితరులు పూజించుటకు వచ్చియున్నను లేకున్నను, మీ రెక్కువ వైభవముతోను, ఎక్కువ యుత్సాహముతోను పూజ చేయఁగలుగుదురు.

ఈ సామర్థ్యములను మీరు చేకూర్చుకొనిన తరువాత, జీవిత రహస్యముల నెరుంగుటకు వానివలెనే ముఖ్యములైన యితర గుణములు, వాటంతటవియే ప్రకాశించును. ఆ యితర గుణము లేవియన, మనస్స్వస్థతఁగలుగఁజేయు నోరిమి, మీరు సత్యమును తెలిసికొన్నట్లు పైకి వెల్లడియగుట కత్యావశ్యకమైన నిగ్రహము, సమత (Poise), సహకార సహితమగు స్వాతంత్ర్యము. మీ మనస్సు, రాగములు, దేహము స్వతంత్రములై యుండవలెను; అయినను, మీ రితరులతోఁ గలసి పనిచేయఁగలిగి యుండవలయును; ఏలయన, మనమందరము నొక్కమార్గముననే నడుచుచున్నాము; ఒక్క గమ్యస్థానమునే చేరఁ బోవుచున్నాము; ఒక్క ధర్మమునే, ఒక్క వాక్కునే యనుసరించుచున్నాము. సర్వ వ్యాపకమగు నీ ధర్మమును, సకల భూతములలో నొక్కటియైయున్న జీవచైతన్యమును, మనము గ్రహించినయెడల, అందరి యెడలను నిజమైన స్నేహభావముతోను, అనురాగముతోను ఉండఁగలము.

అప్పుడే యితరుల సుఖదుఃఖములను గ్రహించుటకు మీకు సాధ్యమగును.

ఈ సామ్రాజ్యమును బొందుటకు ప్రయత్నించు వారమగు మనము పురాతనములైనవియైనను, క్రొత్తవియైనను, ఆచారసంప్రదాయములకు బద్ధులమై యుండక, జీవితోద్దేశ్యము నెరింగిన వార మగుట వలన నూతన జీవితమార్గముల నవలంబించవలెను. ఈ ఎర్ర భవనమునకు వచ్చువారు, ఇచ్చట నిలిచి పనిచేయుటకై వచ్చువారు, ఇదివరకే

కష్టముల ననుభవించనియెడల నిచ్చట కష్టముల ననుభవించుటను నేర్చు కొనుటకై వచ్చువారు, ఇచ్చట నాధ్యాత్మికములగు సుఖమును, సంతోషమును, అనుభవించుటకు వచ్చువారు, ఈ యొక్క ధర్మముచే ప్రేరితులై, ఈ యానందసామ్రాజ్యమున ప్రవేశించవలెను. తాత్కాలికముగ మబ్బుపట్టి సూర్యుడు మనకుఁ గనబడకుండ నున్నను, మన మొకే మనోరథముచే, ఒకే ఆప్యాయతచే ప్రేరితులమై పనిచేయవలెను. ఈ స్థలము మనకు క్రొత్త కల్పనాశక్తి నొసంగవలెను, క్రొత్త జీవిత భావములను, ఆధునిక సమస్యలను పరిష్కరించుట కెన్నడో మరచిపోయిన ప్రాచీన ధర్మముల నొసంగవలెను. లోకమును పరవశముగఁజేయగల సువాసనలతో గూడిన పరిశుద్ధప్రాణశక్తి కలుగఁ జేయవలయును.

మనము పూజించు మహాపురుషుడే మన యజ్ఞవేదికయు, సకల వస్తువులకు మూలము నగుటనలన, మీరందరు నా యానంద సామ్రాజ్యమునఁ బ్రవేశించి, అందరు నొకే నదిమూలమున దప్పి దీర్చుకొని, యొకవేదిక చెంత పూజించవలెను. ఆయన తర్కమున కతీతుడు, వాదములకు లోనగువాడు గాడు, స్వార్థములగు కాంక్షలకును ప్రయత్నములకును మించినవాడు. ఆయిన మన యంతరాత్మ. మీ రా ధర్మము నంగీకరించి యున్నంతవరకు, ప్రయాసపడుచున్నంత వరకు, మీ ప్రయత్నము లుత్తమములై యున్నంతవరకు, మీకు జీవిత రహస్యముల విషయమున నూతనాభిప్రాయములు గోచరములై, దుఃఖములో నున్నవారికి నూతనోత్సాహమును, ఆనందమును మీ రొసంగఁగలరు. అందుకొఱకే—నిర్మాణశక్తి సంపాదించుటకే, మీ జీవితములలో జివు జివులాడుచుండు గాయములను శాంతింపఁ జేయుటకే,—మీరిచ్చటకు రాఁదగును. ఆగాయములు శాంతించిన క్షణముననే, మీరు శాంతి నొందిన క్షణముననే, ఆ శాంతి నితరుల కొసంగఁ గలరు.

భేదములను నిరూపించు క్రొత్త సంకేతములనుఁ గనుటకును, వ్యర్థములగు తమ తమ డంబములను తృప్తిపరచుకొనుటకును ఇది చోటు గాదు. ప్రతివాడును సాధ్యమైనంత వరకు అపాయముల నెదుర్కొనిఁ, సాధ్యమైనంత తీవ్రముగ, సాధ్యమైనంత సాహసముతో, సనాతనమగు నీ ధర్మము ననుసరించి జీవించవలసిన స్థలము ఇది. ఈ స్థలమును మీరు విపరీతములగు మనోరథములతో నిండిన యరణ్యముగ జేసి, మీరు పిరికి పందలై పోరాదు. క్షుద్రదేవతలను కల్పించుకొని, క్షుద్రాలయములలో పూజించరాదు. ఈ పని మీరు మరియెచ్చటనైనఁ జేసినను జేయవచ్చును, గాని యిచ్చట మాత్ర మది యక్కరలేదు. అట్టి దేవతారాధన తప్పు, అట్టి చిత్తవృత్తి తప్పు, అది సరియైన భక్తి కాదు. ఈ నదిమూలమున నొకసారి దప్పిఁ దీర్చుకొనిన మీ రింకొకచోట జలపానము నాశించరు; ఇచట నొకసారి పూజచేసిన మీరింక లోకములో దేనిఁగూడఁ బూజింపఁగోరరు. ఎదురుగ సూర్యుడుండగా దీపము వెలుతురున పూజింపఁగోరువా డెవడైన నుండునా? మీరు దినమంతయుఁ జేయుచున్న దదియే. స్వల్ప గృహములలో, చిన్న గుళ్లలో క్షుద్రారాధనములను జేయుచు, దానిని సమర్థించుకొనుచున్నారు. ఇచ్చట మానవకోటి యంతయుఁజేరి పూజింపగల పెద్ద పూజాపీఠమును నిర్మించుటకుఁ బ్రయత్నించుచున్నాము.

ఇదంతయు మీరు స్వయముగఁ దెలిసికొనవలెనని మరి మరి యెక్కువగ కోరుచున్నాను. మీయం దది యంతర్గతము గావలయును. నే నుపన్యసించగలను, మాట్లాడగలను, అరవగలను, పాడగలను, ఈ సామ్రాజ్యముయొక్క యానందము వలన గలుగు పులకరింపును నా మట్టుకు నే ననుభవించఁగలను. బహుశః మీ యందు కొంచె ముత్సాహమును రగుల్కొల్ప గలనేమో; కాని ప్రయత్న మేమో మీరే చేయవలెను. నిజమైన సంతసము నొనగూర్చు సౌందర్య మెచ్చటనున్నదో,

అన్వేషించదగిన సత్యమొక్కటి యెచ్చట నున్నదో, మీకు జీవితగతి నొసంగు ధర్మమొకటియు నెచ్చటనున్నదో, ఆ యానంద సామ్రాజ్యమునఁ బ్రవేశించుటకు, ఆ మీ గమ్యస్థానమును జేరుటకు యథార్థమును, నిత్యమును నగు గొప్పయాశ మీకుండవలెను. వృద్ధిబొందుటకును, అనుభవించుటకును, ప్రయత్నించుటకును మీరు స్వతంత్రులై యుండవలెను. మీ రారోగ్యవంతులై యుండుటకై నేను అన్నపానములను తీసికొని నంతమాత్రమునఁ బ్రయోజనములేదు. అట్లయిన లోకమంతయును రేపే ముక్తి నొందును. లోకములో నున్న మృష్టాన్నములన్నియుఁ దిని నాకడుపు నింపుకొనఁగలను. కాని మీయాత్మలను పోషించుకొని, ఆ యాత్మాభివృద్ధికై సరియైన పరిస్థితులను, అవకాశములను, సాహసకృత్యములను మీరే సమకూర్చుకొనవలెను. మీలో ప్రతియొక్కరును, ఇదివరకు, మీ మీ యంతరంగ వాక్కును, మీ మీ సూర్యజ్యోతిని గనుగొనియుండని యెడల, నిటుపైని గనుగొనవలెను; మీ కీ యల్లకల్లోలము, ఈ కాంత్రి, ఈ తీవ్రేచ్ఛయుఁ నుండవలెను. మీ రావాక్కును గనుగొనిన తరువాత, రాజభవనములోఁ గాపురమున్నను, వీథుల వెంబడి దిగంబరులై, భిక్షాపాత్రను చేతఁగొని తిరుగుచున్నను, భేదములేదని నిశ్చయముగఁ జెప్పఁగలను. అప్పుడు శాశ్వత జీవితము నొసంగు నొక్కటియగు వస్తువు మీకు లభించియుండును; అప్పుడే మీరితరుల కా యనుభవమును కలుగజేసి, వా రానందముగ నుండునట్లు చేయగలరు.

---

# X

## యజ్ఞవేదికపై హోమము

ఇంతవరకును నేను చెప్పిన సంగతులను శ్రద్ధతో వినియుండినయెడల, ఈ యానందసామ్రాజ్యమునఁ బ్రవేశించుటకు బంధకారణములగు విషయముల నన్నిటిని తొలగించుకొనుటయు, ఈ భూలోకమునకును ఇచ్చటి దుఃఖములకు సుఖములకు, వివిధములయిన బాధలకు—మిమ్మలను కట్టిపెట్టియుంచువాని నన్నిటినుండియు విముక్తినొందుటయు, ఆవశ్యకమని మీకు తోఁచియుండును; మీరు గ్రహించియుందురు. వానినుండి తప్పించుకొని, విముక్తినొందుటయన జ్ఞానసిద్ధి, నిర్వాణప్రాప్తి, ఒక్కటియగు ధర్మము ననుసరించుట, ఒక్కటియునుఁ పరిపూర్ణము నగు నానందసామ్రాజ్యమునఁ బ్రవేశించుట, యనియును దెలిసికొనియుందురు. ఈ విముక్తినొందుటకై కర్మవిమోచనముకూడ కావలయును. నీవు పూర్వజన్మములలోఁ జేసిన కర్మము నిప్పుడు మార్చుటకు సాధ్యము కాదుగదా? ఆ పూర్వజన్మములలో నీ వనేక పొరపాట్లొనరించి యుందువు; పాపము లని చెప్పబడు పనుల ననేకముల చేసియుందువు; అవివేకముగఁ బ్రవర్తించియుందువు; వాని నన్నిటికిని ఫలితముగ నీ కిప్పుడీ బంధములును, దుఃఖములును, ప్రాప్తించినవి. అయితే, వర్తమాన భవిష్యత్కాలములు నీచేతిలో నున్నవి. ఇప్పుడు నీవుచేయు పనులనుబట్టి ముందు నీకు రానున్న యర్థములు గలుగును, గనుక ముందు నీకుఁగావలిసిన యర్థములు కలుగుటకు తగినట్లుగ నిప్పుడు పనిచేసి, దేశకాలము లనియెడి మాయావ్యామోహమునుండి తప్పించు

కొనఁగలవు. తత్త్వమును భోగపరచుకొనుటకు ప్రయత్నించుచున్న మీరు, ఈ నిలయమును ప్రవేశించుటకు, శాశ్వతానందము వెలసియున్న యీ సామ్రాజ్యములో నొక భాగముగఁ జేరిపోవుటకు ప్రయత్నించుచున్న మీరు, ఇప్పుడుగాని, యికముందుగాని క్రొత్తకర్మమును ప్రోగుచేసికొనరా దని, మీకును మీ గమ్యస్థానమునకును మధ్య క్రొత్త ఆటంకములను కల్పించుకొన రాదనియు నెరుగవలెను. అనగా, మీ రెప్పుడును మెలకువతో కనిపెట్టి చూచుచుండవలెను; ఎల్లప్పుడును ఆత్మానుస్మరణముగలిగి, గంభీరముగను, సంతోషముగను, ఆత్మశోధన చేసికొనుచుండవలెను. అప్పుడు మీ రాగము లెట్టివి యైనను, మీ తలంపులును, మీ కోరికలును ఎట్టివియైనను, అవి యీ సామ్రాజ్యములో ప్రవేశించుటకు మీ కాటంకము కలుగఁజేయజాలవు. ఆ సామ్రాజ్యద్వారము లెప్పుడును మూయఁబడవు—ఆ సామ్రాజ్యమునకు యథార్థముగ ద్వారములుగాని, యాటంకములుగాని లేవు; ఆ యాటంకములను, ద్వారములను, ద్వారపాలకుని, కల్పించుకొనువారు మీరే. కర్మమును జయించవలెనన, జాగ్రత్తతో నాలోచించుట, ఆత్మపరిశోధన, నిత్యప్రవర్తనములో ప్రతిస్వల్ప విషయమును, దైనందిన జీవితమునందలి మీ తలంపుల నన్నిటిని, మీ సుఖములను, సంతోషములను, పరీక్షించి చూచుకొనుచుండుట, ఇవియే సాధనములు.

ఆత్మపరిశోధన మనగా, నవ్యవస్థచిత్తుడై యుండుటగాని, స్వవిషయమునే చింతించుచుండుటగాని, ఇతరులనందరను విడచి తనలో తానే నిమగ్నుడైయుండుట గాని కాదు. మీ కాత్మపరిశోధనాశక్తి యున్న యెడల, నొక్కొటియగు మీ యున్నతోన్నతకాంక్ష ననుసరించి మీ మానసిక శరీరము, కామశరీరము, స్థూలశరీరముఁగూడ, వృద్ధినొందించుకొనుటకు అది మీకు ప్రోత్సాహము కలిగించును. ప్రాకృతికిగ యేదో యొక వైపునఁ బ్రాకక, నలువైపులకును విస్తరించుట దానికి స్వాభా

వికసించినట్లే, మీకును నలువైపులకును బ్రిమ్మరుట స్వభావము కావచ్చును. కనుక నిపుణుడైన తోటమాలి లతను ఏవిధముగా చక్కగా బ్రాకునట్లు దిద్దునో, అట్లే మీరును మీ మనస్సులను హృదయములను దిద్దుకొనవలెను.

పైన చెప్పినట్లుగా, ఆత్మపరిశోధనమువలన నవ్యవస్థచిత్తతగాని, ఖిన్నతగాని కలుగరాదు. విద్యార్థి తాను పొందదలచిన యర్థమునుం బొందుటకై యెట్లు దినదినమును క్రమాభ్యాసముం జేయునో, యట్లే యాత్మపరిశోధనాశక్తిని స్వాభిమానము లేకుండ ఉపయోగించవలెను. ఇట్టి యాత్మపరిశోధనము చేయక, ఇట్టి గాఢపరీక్షంగావించుకొనక, శీలమును బలపరచుకొనంజాలవు. శీలము లేనియెడల, సుగుణములు చక్కగాను పూర్తిగాను పెంపొందనియెడల, మీరు మోక్షమార్గానుగమనము చేయుటకు, సృష్టిచేయుటకు, ఉత్తమజీవితము గడుపుటకు, నావశ్యకములగు నంతరంగ గుణసంపత్తి లేక, యెండు కట్టెలవలె నిర్జీవులై యుందురు.

మీలో ప్రతివాడును పూజాపీఠమునొద్ద నేదోయొకటి సమర్పింపం గలిగి యుండవలెను. ప్రతివాడును ఆలయమునకు వచ్చునప్పుడు మీ బుట్టలలో పుష్పములను—పూర్తిగా వికసించి, చూచుట కందముగాను తేజోవంతముగాను ఉండి, కమ్మని సువాసనల వెదంజల్లు పుష్పములను—గొని తేవలెను. అట్టి పుష్పములను గొనివచ్చినవారా యాలయములో బ్రవేశించుట కర్హులుగ నంగీకరింపంబడుదురు; కాని, పుష్పములు లేని యుత్తబుట్టలను మాత్రము గొని తెచ్చిన వారు—పూర్తిగా వికసించిన దివ్యశక్తులు లేక, కేవల లోకమర్యాద ననుసరించి పూజింపం బూనుకొనువారు, బొత్తిగా పనికిరారు. మీరు సమర్పించుట కేదో యొకటి మీయొద్ద నుండవలెను. "నన్ను నేను సమర్పించుకొనుచున్నాన" ని చెప్పిన చాలదు. మన మీయదగిన దేదియు మనయొద్ద

లేదు గనుక, మనమందరమును గూడ నట్లు సమర్పణము చేసికొనెద మని చెప్పఁగలము. లోకములో తనది అనఁదగిన వస్తువేదియు లేని వాడు 'నేను లోకమును త్యాగముచేసెద' ననిన నెట్లుండునో ఇదియు నట్లే యుండును. అనుభవశాలి యయినవాడు, లోకజ్ఞానముగలిగి లోకమును జయించినవాడు, తన సంపదలను, కీర్తిని, త్యజించినయెడల ఆ త్యాగమునందు మహిమయున్నది. వాడు అనుభవములను సంపాదించినాడు, కష్టముల ననుభవించినాడు, కనుక వాని త్యాగము లోకములో నందరకును ఆదర్శముగ నుండును. తన యుద్యానమున గులాబిపుష్పములు లేని వాడు "నాకున్న వన్నియు త్యజించెద" ననిన దానియం దేమియు ప్రయోజనములేదు. ఏలయన, వానిభక్తియును, తెలివియును, మందగతితోనుండును. అట్టివాడు త్యాగముచేయఁబోయిన యెడల, వాని చేష్టయం దందము లేదు. అట్లుగాక, విజ్ఞానసంపన్నుడు, భక్తి పూరితుడు, శక్తిసామర్థ్యయుతుడు నగువాడు తన సర్వమును త్యజించి, తన యాదర్శము ననుసరించినయెడల, వాడు ఆలయమును ప్రవేశించుటకర్హుడుగ నంగీకరింపఁబడును.

ఒకవేళ మీకు బుద్ధికుశలత యెక్కువగా లేకున్నను, సామర్థ్యము ఎక్కువగా లేకున్నను, భక్తి పూర్తిగా లేకున్నను, వ్యాయామశక్తి విశేషముగ లేకున్నను, చక్కగా తీరిన సుగుణసంపత్తిని, చక్కగ నెరవేర్చిన కార్యమును, మీ స్వంత యుద్యానములోఁ బెంచి, కష్టకాలములో కూడ కాపాడియుంచిన పుష్పమును మాత్ర మైనను ఈయగలరు. అట్టి యీవిని, అది ఎంత స్వల్పమైన దైనను, నీతో పూజాపీఠమునొద్దకు గొనివత్తురేని, యది సార్థకమగును; ఏలయన, మీరప్పుడు స్వీకరించుటకు తగినవియు, నుత్తమములు నగు వస్తువుల నొసంగ నేర్చితి రని యర్థము. ఇదివరకు నేను చెప్పినట్లు, ఆ వాక్కు, ఆ శాసకుడు, సర్వమును త్యజించి తన ననుసరించి రమ్మని మిమ్ములను

పిలచు కాల మెప్పుడో యొకప్పుడు రాకతప్పదు. వచ్చును. ఆ కాలమునకై యెదురుచూచుచు మీరు సిద్ధముగానుండవలెను. మీ యుద్యానమును చక్కగా కలుపు దీసి, నేప్పపగళ్, పుష్పములను కోసికొనుటకు సిద్ధముగా నుంచవలెను. అట్లుంచిన యెడల, మీ భక్తిని, మీ తెలివిని, ఎక్కువగ నిశ్చయముగా సమర్పింపఁగలరు; వానిని మీరు చక్కగా కృషిచేసి, వాని సామర్థ్యముల నెరింగియున్నారు గనుక, నవి వినియోగింపఁబడు నను జ్ఞానముతో సమర్పింపఁగలరు. అంతట మీరే వానికధికారులై యుందురు. మీరు త్యాగము చేసినపుడు— మీ సంతోషమును, మీ సుఖమును అనుసరించి మీరు చేయునది త్యాగ మనఁ దగినయెడల— ఈ పుష్పములతోఁ గూడ మీరు ఆలయమునకు వచ్చినపుడు ఆ యాలయమందలి ముఖ్యార్చకుడగు మీ యంతరంగవాక్కు, మీ శాసకుడు, మీ ధర్మనియంత, ఆ పుష్పములను త్రీసికొని, వానిని ఉపయోగించి, పోషించి, వాని నెక్కువ చక్కనివిగాఁ జేసి, వానిని వీర్యవంతములుగను దివ్యములుగను జేయును.

మీ రింకను అంధకారములోఁ దిరుగుచు, తడుముకొనుచు నున్నప్పుడే, ఈ స్వభావమును ఎడతెగక చక్కఁబరచుకొనుచుండుట, ఈ ఫలమును పండునట్లు చేయుచుండుట, యత్యావశ్యకము. సమయము వచ్చినపుడా ఫలమును గోసికొనవచ్చును; ఆ ఫల మితరులకు పుష్టిని సంతోషమును గలుగఁజేయును. ఆత్మానుస్మృతి, నిరంతరము మెలకువ గలిగి యుండుట, నిరంతరము కనిపెట్టి చూచుచుండుట, యావశ్యకమనుట యిందులకే. మనము నిద్రపోరాదు, కాని స్వప్నములను గాంచవచ్చును. మనము మేలుకొనియుండవలెను, కాని మనోరథములను వాంఛింపవచ్చును. నెమ్మదిగ మన మెంత కనిపెట్టి చూచుచుందుమో, ఎంత యప్రమత్తులమై యుందుమో, అంత యెక్కువగ కర్మబంధమును కలుగజేయు అల్పవిషయములతో పోరాడఁగలము;

ఈ జననమరణచక్రమునకు, ఈ కల్లోలమునకు, దుఃఖకారణ మగు నీ యెడతెగని యస్పష్టవిషయమునకు, మనలను బంధించుదానితో బాగుగ పోరాడఁగలము. వీనినన్నిటిని విడిచిపెట్టుటవలన నా సామ్రాజ్యములో నివసించఁగలుగుదురు. మీ మనస్సు చక్కఁగా శిక్షితమై, రాగభావములు చక్కఁగా బలపరచి, సంస్కరింపబడి, స్థూలశరీరము మీకు లోబడియున్నప్పుడే మీ రన్నిటిని విడిచిపెట్టఁగలరు.

ఈ యాత్మానుస్మృతి, ఈ యాత్మపరిశోధనము, పెద్ద విషయములను చిన్న విషయములను గూడ పరీక్షించుట, ప్రతిదినము జరుగవలయును. కనుక ఈ స్వల్పలోపములు పోవలెననిన, మీరు ప్రతిదినము ధ్యానముచేయవలెను, ఆలోచన చేయవలెను, విమర్శించవలెను; ధ్యానము చేయుటవలన సృష్టించఁగలరు. రాగభావములను గూడ నట్లే శుద్ధిచేయవలెను; అనగా అహంభావము లేకుండచేసి, బలపరచవలెను; క్షుద్రత, స్వార్థత, ఈర్ష్య, కోపము, మొదలగు గొప్ప ఆటంకములు గలుగజేయు స్వల్ప సంక్షోభములనన్నిటిని తొలగించవలెను. మీ మనస్సును, రాగములును, అతి సులభముగ వ్యవహరించవలెను. అట్టి మనస్సును రాగములు నున్నయెడల, శరీరము నతి సులభముగ లోబరచుకొనవచ్చును. ఈ శరీర సంబంధములగు కోరికలనుండి, లేములనుండి, కష్టములనుండి, విడిపించుకొని, శరీరము నొక చక్కని యంగీవలెఁ జూచుట బహుసులభము. నా స్వంత విషయమును గురించి ప్రస్తావించిన క్షమింతురేని యొక సంగతిఁ జెప్పుదును. ఒకప్పుడు నే నిండియాలో నీలగిరిలోని యుదకమండలమున నున్నపుడు, శరీరమును విడిచి, శరీర మెట్లున్నదో చూచుట కేదైన మార్గమున్నదా యని కనిపెట్టుటకు ప్రయత్నించుచుంటిని. మొదట ప్రయత్నమంత సార్థకముగా లేదు. అయితే రెండు, మూడు దినములు, బహుశః ఒకవార ముండవచ్చును, ప్రయత్నమును చేయుచునే యుంటిని. తుదకు బహు సులభముగ

శరీరమునుండి పైకివచ్చి, దానిని చూడవచ్చునని కనిపెట్టితిని. నేను నా పడక ప్రక్కను నిలువఁబడియుండి పడకపైనియున్న శరీరమును చూచుచుంటిని. అది యతి యసాధారణమగు ననుభవము. ఆ దినము మొదలు శరీరమునెడల నసక్తభావము కలిగినది; ప్రభుసేవకులకు గల భేదము స్పష్టమైనది; కనుక నా శరీరమునకు వాంఛలున్నను, నిలుకడ లేక చరించవలెనని, స్వతంత్రముగ జీవించి యానందించవలెనని కోరిక యున్నను, నా యంతరాత్మ చేయు కార్యమునకు ఏ యాటంకమును కలుగుటలేదు. అందుచేత, మీ శరీరములనన్నిటిని—మానసిక, కామ, స్థూలశరీరములను—కూడ చక్కగా శిక్షించి, అవి స్వతంత్రముగ వ్యవహరించఁగలిగినను, పరస్పర సహకారులై వ్యవహరించునట్లు చేయవలయును. అట్లు చేసినయెడల రాగములను జూచి మనస్సు "మీ రీ యీ భావములు మాత్రమే కలుగఁజేసికొనుడు, ఇంతకు మీరిపోవద్దు" అని నియమించఁగలుగును. రాగములుగూడ స్థూలశరీరము నట్లే నియమించఁగలుగును. ఇట్లు మీరు మూడు భిన్నమూర్తులుగ నున్నారు. ఇది తెలిసికొనినయెడల బహు వినోదకరముగ నుండును. ఉత్సాహ మెక్కువ యగు; ఒకటికి బదులుగ ముగ్గురు భిన్నమూర్తు లుందురు; కనుక, ఒక్కని యభిప్రాయమునకును, ఒక్కని కర్మమునకును, ఒక్కని ప్రయోజనమునకును, ఒక్కని యుల్లాసమునకును, బదులుగ ముగ్గురియొక్క యభిప్రాయములు, కర్మము, ప్రయోజనములు, ఉల్లాసములు నుండును. ఆ విధముగా, మీరు, ఒక ప్రత్యేకవ్యక్తిగా నుండుటకు బదులుగా, ప్రపంచములో నొకభాగమై, యీ బ్రహ్మాండ మంతటిలో నొక భాగమై యుండుట తెలిసికొందురు; తెలిసికొని మీ భిన్నాత్మను, మీ మూడు భిన్నాత్మలను, మఱచి, కోట్లకొలదిగా నున్న యాత్మలలోఁ జేరిపోవుదురు. ఆ వ్యక్తులన్నియును గూడ, వివిధరూపములుగ వ్యక్తములయియున్నను, ఒక్క మార్గముననే

ప్రయాసపడుచున్నారు. మీరీ సంతోషము ననుభవించినయెడల, ఈ మూడు మూర్తులను సుశిక్షితులనుగఁజేసినయెడల, మీ కర్మబంధములలో ననేకములనుండి విముక్తినొందుదురు; మీరు ముక్తులై, విషయము లన్నిటినుండి దూరముగఁ బోఁగలరని ఆ సామ్రాజ్యమునఁ బ్రవేశించి, యచ్చట శాశ్వతముగ వసించియుండఁగలరని, తెలియఁగలరు. అంతట మీకు క్రొత్త ప్రబోధము, క్రొత్త సంతోషము, క్రొత్త ప్రాణశక్తి యుఁ గలుగును. అనుభవమువలనఁ గలుగు దుఃఖములను మీరు రుచిచూడ వలయునని, గ్రహించవలెనని, తెలిసికొనవలెనని, పరిశోధించవలెనని కోరుదురు; మీరన్ని పనులను చేయుచున్నను, వానివలన తప్పక కలుగఁ దగు బంధములు గలుగకుండ నుండవలెనని కోరుదురు. వెలుపలినుండి పరీక్షించి చూచువారివలె చూచుచు, వివేకము నుపయోగించుచు, మంచి చెడ్డల నెంచుచు, సమత్వమును సమకూర్చుచు, తీర్మానించుచు నుం దురు; అట్లు మీరు దినమంతయు, ప్రతిక్షణమును, చేయఁగలిగిన యెడల, ఆ చేయునది చాల ప్రమాదముగ భావించిచేయక, సారస్య విహీనముగ చేయకున్న యెడల, ఆ నిలయద్వారములు మీకొరకు తెరచి యుండి, మీరు లోనికిని బైటకును పోవుచు, మీ యిష్టమువచ్చి నప్పుడు, మీయిష్టము వచ్చినచోట కూర్చొని పూజచేయవచ్చును. అది యొక్కటియే జీవితమునఁ గలుగఁగల యానందము, బుద్ధిశాలికి కలుగఁగల యుల్లాసము; ఏలయన, బుద్ధిశాలియెవ్వడును ఈ లోక ముతో (కేవల లౌకికసుఖానందములతో) నెంతయోకాలము తృప్తి నొంది యుండఁజాలడు—వాని కంతకంటె పైదేదో యొకటి కావలెను, మనోరథములు, గొప్ప కాంక్షలు గావలెను. మనలో యథార్థముగ బుద్ధిశాలురు బహు కొద్దిమందియే యైనను, నూతన విషయములను గనుగొనవలయునను సాహసబుద్ధిగలవారు బహు కొద్దిమందియే యైనను, వారే నిరంతరము క్రొత్తకల్పనలను, క్రొత్త సృష్టిని జేయఁగలరు; ఆటంక

ములను తొలగించి, వెలుతురు రాకుండ నడ్డుచున్న—సత్యమును
మరుగుపరచుచున్న—తలుపులను తెరువఁగలరు. అప్పుడు గొప్ప
మనోర ములను భావించుట యందు, గొప్ప మనఃకల్పితదర్శనములఁ
జూచుటయందు, నుత్సాహము, గొప్ప సంతోషమును పొందఁగలుగు
దురు. ఆ మనోరథములును ఆ దర్శనములును సత్యములై యుండును.
నిత్యతత్త్వములై యుండును. అవి పుష్టినిచ్చు నాహారము లగును. వాని
వల్లనే మనము జీవించఁగలము. వానివల్లనే మరణమును తప్పించుకొని
బ్రతుకఁగలము. మనోరథములు దర్శనములు మనకుకావలెను. మన
మెంత కార్యవాదులమైనను, ఎంత నూటిగా ప్రవర్తించువార
మైనను, మన కీ యంతర్ముఖత్వము, ఈ యదృశ్యజీవితము, అత్యా
వశ్యకముగ నుండవలయును. మన మీ యనంతకాలమున నిరంత
రము సవరించుచు, బాగుచేయుచు నుండునట్టియు, స్వతంత్రముగ
సృష్టించుచు, తిరిగి నూతనముగ నిర్మించుచున్నామని మనకు సం
తుష్టి నొసంగునట్టియు, మనము నిజముగా చేయఁగోరు పనిని చేయు
చున్నామని సంతుష్టిఁ గలుగఁ జేయునట్టియు, ఆత్మతృప్తి యను భయం
కరభూతమునుండియు, ఎల్లప్పుడు నొకే సంఘములో నొకే గుంపులో
నుండవలయునను భావమునుండియు, మనలను విడిపించి కాపాడు
నట్టియు, చిత్తరువును మనము చిత్రించుచుండఁగల ఫలకము మనకు
స్వంతముగ నుండవలెను. మనలో నెవ్వరికైన నుండవలసిన సత్య మది
యొక్కటియే. మన సామ్రాజ్యము నొకసారి ప్రవేశించినవారు, ఒక
సారి చూచినవారు, ఒకసారి కలలో నైనను గాంచినవారు, తిరిగి
తిరిగి యందు బ్రవేశించుటకును, అందులో నివసించుటకును అర్హు
లగుదురు.

# XI

## మనోజ్ఞమగు నుద్యానము

మిమ్ముల నానందసామ్రాజ్యమునం బ్రవేశపెట్టి, ఆ నిత్యత్వమున నివసింపఁజేసి, యందలి యతి పవిత్రవాయువును బీల్చఁజేయఁగలుగు దునుగాక యనియు, ఆ సామ్రాజ్యములో సుఖముగా వినోదించునట్లు చేయఁగలుగుదునుగాక యనియును, నేను గోరుచున్నాను. మిమ్ములను నా హృదయములోనికి, నా మనస్సులోనికి, దోడ్కొనిపోయి సంగతుల నున్నవి యున్నట్లుగఁ జూడఁజేయవలయునని, లోకమును యథారూపముగ ననుభవింపజేయవలయునని, నిజముగా శాశ్వతములు సనాతనములునగు వస్తువులను నేను చూచునట్లు మీకును జూపవలయునని, నేను గోరుచున్నాను. అయితే మీకు పరిచయము లేని క్షేత్రములలో తిరుగుడనిగాని, మీకుఁ దెలియని విషయములను, ఇదివరకనుభవముకాని, జ్ఞాపకములేని విషయములను, అనుభవించి సంతసింపుడనిగాని, నేను గోరను; మిమ్మడుగను; మిమ్ము ప్రోత్సాహముచేయను; ఏవిధముగను బలవంతముచేయను. మీరు స్వయముగ నీ నిత్యనిలయము నెరింగి యుండుటవలనను, ఈ సత్యమును, ఈ వాస్తవ్యములను స్వయముగఁ దెలిసికొనియుండుటవలనను—మీరా సామ్రాజ్యమును స్వయముగ దర్శించి, యందు స్వయముగ నివసించి, యందలి సుఖములో నోలలాడి సంతసించినవారగుటవలనను—మిమ్ములను ఆ సామ్రాజ్యములో, సత్యమగు ఆ ప్రపంచములో నిలకడచెందియుండుడని కోరుచున్నాను; అందులో సంచరించి, అసత్యమును అనిత్యమునగు నీ లోకమునకుఁ

తిరిగివచ్చినను, ఇచ్చట నిరంతరము నా సద్వస్తువులో నివసించియుండు డని కోరుచున్నాను. మనలో చాలమంది ఆ సత్య సామ్రాజ్యమును, ఆ వాస్తవ్యమును, ప్రవేశించుటలో, నేదో వింతస్థలములో, ఏదో యపరిచితస్థలములోఁ బ్రవేశించినట్లుగాఁ బ్రవేశింతుము; యథార్థముగ నింద్రియ గోచరమగు నీలోకమే వింతస్థలము, అపరిచితము, అనిత్యము, క్షుద్రము, ఎందుకును కొరగానిది.

ఈ సామ్రాజ్యములో నొక్కసారి ప్రవేశించినయెడల, అందలి యాప్యాయత, నెమ్మది, ప్రసన్నతను, ఒక్కసారి యనుభవించిన యెడల, సత్యములును, జీవనాధారములును, ప్రయోజనకరములును, అగు వస్తువు లెన్నడును మరపునకురావు; మీకు సంశయ మెన్నడు నుండదు, దుఃఖమెన్నడును కలుగదు. అపుడు మీరు గ్రుడ్డివారివలె ఇతరుల ననుసరించుట లేదని తెలిసికొందురు. పరమును, నిత్యమునగు వస్తువు నప్పుడే మీ రనుసరించుచున్నారని యెరుంగుదురు. అపుడే సర్వ భూతాత్మతో మీ రేకీభావము నొందుట. అప్పుడే మీ రితరులను నమ్మించగలరు; పండితుల వాక్కును, జ్ఞానులయొక్కయు, కారుణ్యమూర్తులయొక్కయు హృదయమును, మీ కప్పుడే గలుగును. మరియును, దుఃఖమునుండియును, ప్రతిదినమును తమను అణచివేయుచున్న క్షుద్ర విషయములనుండియును, మనుష్యులు తప్పించుకొనుట యననేమో వారికి నిజముగా తెలియఁజేయగల శక్తిని మీరు అపుడే పొందుదురు. అందువలననే మీరు మిమ్మును తెలిసికొనవలెను; అందువలననే, మీరా యంతరంగవాక్కును వినవలెను; మీరు కష్టముల ననుభవించి, మీకు ప్రతిదినమును సంభవించు ప్రతి స్వల్ప అనుభవములనుండి జ్ఞానమును పొందవలెను. మిమ్మును మీ రొక్కసారి తెలిసికొనిన యెడల, పరమాత్మను దెలిసికొనినవారగుదురు; పరమాత్మ మీలో స్ఫురించి, మీతో నేకీభవించును. ఆయన మీ రెచ్చట నున్న నచ్చటనే

యున్నాడు గాని, ప్రత్యేక వ్యక్తి కాడు; ప్రత్యేకముగ నొంటరిగ ప్రకాశించువాడు గాడు. మీ రెక్కడనున్నారో ఆయన నక్కడనే యున్నాడు; నే నెక్కడనున్నానో ఆయన యక్కడనేయున్నాడు; ఎవడుగాని అ సామ్రాజ్యములో నివసించి యానందించినయెడల, ఆయన వానితోడనుండును. మీరు మిమ్మును తెలిసికొన్నారు కనుక, మీ సత్యాత్మను దెలిసికొన్నారు. అది తెలిసినతరువాత, మూలతత్త్వమునకు మరల మరల రాఁగలరు. మీ కప్పుడు జ్ఞానమునకంతకును కీలకము లభించును; ఆ నిష్యకారుణ్యమునందు, సర్వభూతములయొక్క నిత్యమూలమునందు అంశలైయుండుటకు మీ రెప్పుడును శక్తిగలిగి యుందురు. మీరు స్వయముగనే విషయములను పరిశీలించి భావింపఁ గలశక్తి మీకుఁ గలుగఁజేయుటకు నాకు శక్తియున్న బాగుండును.

ఈ (ఎర్డై) భవనమున కెదురుగనున్న వనమునందు నిన్న నేను కూర్చొనియుంటిని. ఇచ్చట చెట్లు ఏవిధముగాఁ బెరుగుచున్నవో చూచినారుగదా! కొన్ని పొడవుగాను, కొన్ని పొట్టిగాను, ఉండి అన్నియు గలిసి క్రమకుల మొదళ్లచుట్టు నొక గుహాకారముగ నున్నవి. నా వైభవము, నా యానందము, నాకు సత్యమైనదంతయు, సకలవృక్షములకు, సర్వ వస్తువులకు ఆధారమును, ప్రాణము నగు వారిని అచ్చట నేఁ జూచితిని. మీ రొక్కసారి ఆయనను జూడఁగలిగినయెడల, ఆయనయందుఁజేరి యుండఁగలిగినయెడల, మీరా యుద్యానమున శాశ్వతముగ నుండఁ గలరు, కాని యే క్రొద్దిక్రమకులనో, ఏకొద్ది పుష్పములనో చూచుచు నిలుచు పరాయివారుగా నుండఁజాలరు.

రెండురకముల మనుష్యులున్నారు. మాధుర్యము, నవకము, సౌందర్యము, శాంతి, మెల్ల మెల్లని వేయిధ్వనుల మరమర శబ్దములును గల యీ యుద్యానమున, శాశ్వత సౌందర్యముతో నిండిన వాతావరణము గలిగి, శక్తిభావపూరితమై, శాంతి, యత్యద్భుతమగు బలము, యాథార్థ్యము

గల యీ యుద్యానమందున్నవా రొక రకమువారు. ఈ వనము బైటనే యుండి, వృక్షాగ్రములఁ జూచుచు, అక్కడక్కడనున్న కొద్ది పుష్పము లను మాత్రము గాంచుచు, ఎచ్చటను నీడలు లేక, విస్తారముగ ఆకులు లేక, గత ఋతువునందు ఎండిపోయిన కొమ్మలు మాత్రము మిగిలి యున్న చోట నిలచువారు రెండవ రకమువారు. మీ రొక్కసారి యీ యుద్యానములోఁ బ్రవేశించినయెడల, ఇతరులకు దాని తాళపుచెవినిచ్చి, వారలనుకూడ దానిలో స్వయముగాఁ బ్రవేశించునట్లు ప్రోత్సాహము చేయఁగలరు. ఈ యుద్యానమును, ఈ సామ్రాజ్యమును బ్రవేశించు టకు అడ్డముగా తమ తలంపులవలనను, భావములవలనను, మానవులు గోడలను కల్పించుకొన్నారు, గాని, నిజముగా నెట్టి యాటంకములును లేవు. ఒకసారి మీరా సామ్రాజ్యములోఁ బ్రవేశించినయెడల, అంత రంగలోకమును బయటనుండి చూడఁబోరు; బయటనున్న వస్తువులను సత్యదృష్టితో, సకల వస్తువులయొక్క మూలస్థానమునుండి, నిజమైన యాత్మనుండి చూతురు. ఒక్కసారి యీ తాళము మీకు లభించిన యెడల, మీ రెప్పుడును పైకిపోయి, అచ్చట నున్న పలచని పర్ణ జాలమును, ఎండిపోయిన కొమ్మలను, గడచిన ఋతువునఁబూచి వడలిపోయిన పువ్వులను జూడఁగలరు; పైకిపోయి, యనుభవములను సంపాదించఁగలరు; ఏలయన, మీ రా యుద్యానమునఁ బ్రవేశించి, యచ్చట నిజమైన జ్ఞానమును, యథార్థమైన యానందమును కనుగొని నారు.

అందువలననే, సాధ్యమైనయెడల, మిమ్మలను అందులోనికి బల వంతముగఁగాని, మరి యేవిధముగాఁగాని, యీడ్చుకొనియైన పోవలయు నని నేను కోరుచున్నాను. ఒక్కసారి మీరు అందులోనికి పోయి, క్షణమాత్రమైన నా భవ్యదర్శనమును గాంచినయెడల, వస్తువుల బాహ్య సంబంధములతో నెన్నడును దృప్తిఁజెందరు; వెనుకకు మరలి, యా

దృశ్యము నెక్కువ విశాలముగా, ఎక్కువ మహిమాన్వితముగా, ఎక్కువ ప్రకాశముగా చూచుచు నుండవలయునని కోరుదురు. వెలుపలనున్నంత కాలము వేలకొలది భయకారణములు మిమ్ముల వెన్నంటియే యుం డును. నిత్యవస్తువుయొక్క యీ నిలయమును ప్రవేశించిన క్షణ మననే, అనగత్యములైన విషయములు, భయములు, సందేహములు విచారములు, అల్ప దుఃఖములు, ఇవన్నియు మాయమై పోవును ; అప్పు డు, నిజముగా కష్టముల ననుభవించువారును, నిజముగా జ్ఞానమును వెదకు వారును, నిజముగా నమ్మువారును, అగు బహుకొద్దిమంది మాత్రమే నివసించు గుప్త ప్రపంచములో మీ రుందురు. ఆ ప్రపంచముయొక్క టియే శాశ్వతముగా నుండునది ; మీకు సత్య మచ్చటనే లభించును. కనుక మీరందరును ఆ ప్రపంచములోనికిఁ బోవలయును. తక్కిన లోకములలో మీరు దుఃఖములను, మూఢనమ్మకములను, సంప్ర దాయ సిద్ధాంతములను, స్వకల్పితములగు అసద్విషయముల నన్నిటిని కల్పించుకొందురు. ఆలోకములో మీకు వ్యక్తిత్వ ముండదు ; మీ రా యనయం దంశలై యున్నారు. ఆ యుద్యానము ఆయనది, ఆయన నిలయము, ఆయన సామ్రాజ్యము ; కనుక, మీరు—ఒక చిన్న యాకునందును, అత్యున్నతమైన చెట్టునందును గూడ—అన్నిటి యందును అంశలై యున్నారు. మనమందరమును వసించవలసిన, నేను వసించుచున్న, చోటు అదియే. మనమందరమును ఒక్కటే వాక్కును వినుటవలన నుద్రేకము నొందవలెను. ఈ లోకముతో పోల్చి చూచిన నాలోకమెంత యుత్సాహదాయకముగను, జ్ఞానదాయకముగను, వాంఛనీయముగను, సాహస పూరితముగను ఉండునో తెలియును. కాని యీ లోకము మీకు ప్రాప్తించుటకై మీరు శిక్షితులుగావలెను ; మీరా సామ్రాజ్యమునఁ బ్రవేశించువరకు, ఆ యుద్యానమున, సర్వ లోకములలో నతిసుందరమగు నా చోటునఁ బ్రవేశించువరకు మీ

వాక్కు విరామము లేకుండ మిమ్ములను ప్రోత్సాహము చేయునంత పరిశుద్ధముగను, సమస్వరముగను ఉండునట్లు చేయవలెను.

ఆ సామ్రాజ్యము నా వాసస్థానమగుటచే, నాకు మూలస్థానమగుటచే, మీరుగూడ నాతోడ నందు వసింపఁగలుగునట్లు చేయవలయుననియు, నేను కనుగొన్నదానిని మీలో నొక్కొక్కరితో పాల్గొన వలయుననియు కోరుచున్నాను. నేను రుచిచూచినట్లు మీరుగూడ నొకసారి దానిని స్వయముగ రుచిచూచినయెడల మీ రెన్నడును దానిని పూర్తిగా పోగొట్టుకొనరు. మీకది మరల మరల లభించుచుండును. మీరు దానికొరకై యన్వేషించక, దానిని పొందుటకై ప్రయత్నించని యెడల, దాని తత్త్వము నెరుంగఁజాలరు; దాని శక్తిని, దానివలన గలుగు తీవ్రేచ్ఛలను, పరవశత్వమును, మత్తతను మీ రెరుంగఁజాలరు. ఆ సామ్రాజ్య ప్రాప్తి కేవల రాగోద్రేకము గాదు, కేవల మనో వికారము కాదు; అది సత్యము, సర్వ భూతములకు మూలము. అందువలననే యది యంత ముఖ్యమును అంత యథార్థమునై యున్నది. అందువలననే, మీరు గొప్పగా సృష్టించఁ గోరినయెడల, ఉదారముగ జీవించఁగోరునెడల, ఆ సామ్రాజ్యమున ప్రవేశించి, ఆయుద్యానమున నివసించి, యందలి నీడలో నానందించి, యందలి పెక్కు పుష్పముల సువాసనలను, భృంగజాలముల గీతమును అనుభవించవలెను. ఆ యుద్యానమున నివసించుట యనగా నుత్కృష్టముగ జీవించుట, గౌరవముగ జీవించుట, దోషరహితులుగ జీవించుట; చేయఁదగిన యే గొప్ప కార్యమైనను, ఏ శాశ్వత కార్యమైనను, ఆ నిలయము నందుండియే చేయవలయును, ఆ మూలమునుండియే ప్రారంభించవలయును, ఆ సామ్రాజ్యముననే పుట్టవలెను. సర్వ విమర్శనములును, సకల ప్రయత్నములును, కార్యములును గూడ శాశ్వతములు గాక క్షణ భంగురములును, అస్థిరములునైనయెడల అవి నిరర్థకములగును.

మీరు చేయు ప్రతికార్యమును ఆ సామ్రాజ్య లక్షణములను గలిగి యున్నయెడల నవి మానవులందఱకును, దేవతలందఱకును, సకల భూతములకును ఆమోదకరములై యుండును; ఏలయన, ఈ సామ్రాజ్యము దేవతలకు స్థానము; ఆదర్శములకు స్థానము; భావములన్నిటికి మూలస్థానము; కార్యములన్నిటికి జన్మస్థానము

ఈ యుద్యానమును, ఈ నిలయమును, ఎందులకు మీరు వెదకుచున్నారో మీకే స్వయముగ తెలిసి యుండవలెను. ఆ కారణ మొక్కసారి తెలిసినయెడల నది మిమ్ములను విడువదు. దానిని మీ దృష్టిలో నెల్లపుడును బట్టి యుంచుటకు మీరు ప్రయత్నించ నక్కఱ లేదు. మీ యొద్దనుండి యది తప్పించుకొని పోవుననిగాని, మీ తెలివితక్కువ పనులవలన, అల్పములగు కోరికలవలన, చిన్న చిన్న విచారముల వలన, నది మాయమైపోవుననిగాని మీరు భయపడనక్కఱ లేదు. చక్కని ప్రతిమవలె, మనోహరమగు స్వప్నమువలె శాంతిము గల వేళలయందుగాని గొప్ప సందిగ్ధసమయములయందుగాని యది స్ఫురణకు వచ్చును. దాని నెప్పుడును మీ మనస్సులలో నొక ప్రక్క నుంచుకొని, కావలసినప్పుడెల్ల నా యుద్యానమునకుఁ బోఁగలరు. ఈ యసత్ప్రపంచమునుండి తప్పించుకొనఁగలరు.

మిమ్మును మీరు తెలిసికొనవలెను. అంతరంగవాక్కు గర్జించుచు బైటికి వచ్చునట్లు చేయవలెను. ఆ వాక్కు మీకు దొరకునంతవరకు ననేక భయకారణములు కలుగవలెను, అనేక సంశయములు కలుగ వలెను. అంతవరకును శాంతముండగూడదు, నెమ్మది యుండరాదు, సంతృప్తి కలుగఁదగదు, సుఖముండరాదు. తక్కినవన్నియు నసత్తులు. ఇదియే (ఈ వాక్కును గనుగొనుట) మహదాదర్శము, ఇదియే జ్ఞానసారము.

నిశ్చలముగ నున్న నీటియందు, ఆకాశము నిర్మలముగా నున్నప్పుడు ప్రతి చిన్న నీడయును, పైనుండి యెగురు ప్రతి పిట్టయును, పిల్ల

వాయువులచేఁ దరుమఁబడిన ప్రతి మేఘమును, ఎట్లు ప్రతిబింబించునో, మీ రెన్నడైన చూచినారా? అకస్మాత్తుగ నొక చిన్న పురుగువచ్చి నిశ్చలముగ నున్న నీటిని కదల్చును; అంతట ఆ ప్రతిబింబము పోవును. నీటిపైనున్న యీ చిన్నపురుగు లోకసౌందర్యము నంతను కలతపెట్టును; ఆ పురుగు అదృశ్యమయిన పిమ్మట పూర్వమువలె, నిశ్చలత, శాంతి, కలిగి, ప్రతిబింబము స్పష్టముగఁ గనబడును. సత్యమును కలతఁబెట్టు ఆ చిన్న పురుగును మీరు త్రీసి పారవేయవలెను. ఆ చిన్న జంతువును దాక్షిణ్యములేక చంపివేయవలెను. భిన్నాత్మభావమే యీ చిన్న పురుగు.

ఆ సామ్రాజ్యమెంత పరిపూర్ణముగ నున్నదో, అంత పరిపూర్ణముగ మీ ప్రతిబింబము గూడ నున్నదను నిశ్చయముతోను, జ్ఞానముతోను, మీరు ప్రతిబింబించు చున్నంతవరకు, మీరే యీ ప్రతిబింబములై యుందు నంతవరకు, ఏ చిన్న పురుగుగాని, ఏ గాలిగాని, మీ జీవితజలములయొక్క నిశ్చలతను కలత పెట్టఁజాలదు. మీ నిజమగు ఆత్మను కనుగొన్నప్పుడే, ఆయన మీకు నిత్య సఖుడుగ మీ రా సామ్రాజ్యములో శాశ్వతముగ, నివసించియుండు నప్పుడే, ఆ సామ్రాజ్యమునకు మీరు పరిశుద్ధములగు ప్రతిబింబములు కాఁగలరు.

అప్పుడు మీయందు పరమశాంతి, విశేషబలమును శక్తిని ఒసంగు శాంతి యుండును; ఏలయన మిమ్మును మీ రప్పుడు తెలిసికొని యుందురు; శాశ్వతములగు వస్తువులతో, సనాతములును, అనుభవార్హములునగు వస్తువులతోఁగూడ వసించియుందురు. మీరు సృష్టించుటకు, స్వప్నముల గాంచుటకు, తెలిసికొనుటకు, జీవించుటకును, మిమ్ములను కార్యోన్ముఖులను జేయఁగలుగుదునుగాక!. కాని, మీరు మేల్కొనవలెను; మీ యంతట మీరే కొరడాతోఁ గొట్టుకొనవలెను; మీకా వాక్కు వినిపించినప్పుడే యీ కొరడాదెబ్బయొక్క బాధనెరుగఁ

గలరు. ఆ వాక్కు ఎప్పుడును పిలచుచున్నది, ఎప్పుడును నిర్బంధించుచున్నది. ఆ వాక్కుయొక్క గర్జన మెంతగొప్పదిగనున్న, మీరు చేయుపనులంత యుదారములుగ నుండును; మీ బల మంత యెక్కువగ నుండును, ఆ యుద్యానమున, ఆనందసామ్రాజ్యమునఁ బ్రవేశించు కోరిక యంత గాఢముగ నుండును.

---

# XII

## నిత్యసఖుఁడు

ఉఱుము బహుళశక్తిమంతముగను, భీకరముగను, గంభీరముగను ఉండును. అట్లే బలసంపన్నుని సత్యవాక్కు గూడ శక్తిమంతముగను, భీకరముగను, గంభీరముగను ఉండును. ఉఱుముయొక్క ధ్వని యొక పర్వతమునుండి మరియొక పర్వతమునకు విసరబడును. ఆ ధ్వని నొక పర్వతము గైకొని యింకొక పర్వతమున కందించును. శుద్ధసత్యమును, స్వనిర్మితమగు సత్యమును అనుసరించువానియందు మన ప్రభువు, మన ధర్మనియంత, మన మార్గదర్శి, మన సఖుడు నగు నా పరమపురుషుని వాక్కుగూడ అదేవిధముగా నుండును. పర్వత మెట్లు ఘనీభవించిన బలముతో నిండియుండునో, ఎట్లు వీర్యపూరితమై యుండునో, ఎట్లు గౌరవముతోను, మహత్త్వముతోను నిండియుండునో, అట్లే ఆత్మజ్ఞాని, తన మనోరథమును స్వయముగ నిర్మించుకొన్నవాడు, తన గమ్యస్థానమును జేరుటకై యతిత్వరితముగఁ బరువిడుచున్నవాడు. అట్టివాడే యోగ్యుడు, అట్టివాడే ఎల్లరకు ఇష్టుడు; అట్టివాడు మనుష్యులకు నాయకుడుగ నుండవలసినవాడు; సృష్టించవలసినవాడు; అట్టివాడు బలహీనులకును, ఉఱుములు కొండలపై నున్నంతబలముగ నెక్కడ నుండవో యట్టి బయళ్లలోనే యున్నవారికిని, తిరిగి బలము నొసంగఁ గలడు. వీరుడు మాత్రమే కొండలపై నిలిచి మహత్తర భీకరసంభవమును అనుభవించి సంతసించఁగలడు కాని సౌందర్యాభిలాషవలనను, ఉఱుముయొక్క ధ్వనివలనను బలవంతునకు కలుగు ఆనంద భావములను

బలహీనుడును, కొండలపై నుండలేక బయళ్లలోనే యుండువాడును, అనుభవించలేడు. బలవంతునకు ఆ వాక్కు, ఆ సౌందర్యము, ఆ శక్తి, ఆ బలము, అతని ప్రయత్నములకు పర్యవసారమైన క్రొత్తజీవితమును కలిగించుచుండును; కనుక వాడే నాయకుడుగ నుండతగినవాడు, సుఖియై యుండఁదగినవాడు. అట్టి బలవంతుడు వృక్షాగ్రములవలె, కోమలములైన కొమ్మలవలె, ఇటునటు నడయాడు పిల్లవాయువుల కాటవస్తువులగు కొద్దియాకులవలె, సూర్యున కానందము గొల్పు చిగురుటాకులవలె, తాము ఇతరులకంటె ఆకసమునకు దగ్గరగానున్నా మను సంతోషాతిశయముతో నృత్యముచేయు చిగురుటాకులవలె, నానంద పరవశుడై యుండవలెను. ఆ పల్లవములును, పర్ణములును, కొమ్మలును, శ్రమనుగాని యలసటనుగాని యెరుగవు; ప్రాణశక్తితో నిండి యున్నను ఎదిరించుట యన నేమో యెరుంగక, వినయము గలిగి యుండును. మరియు నవి తమకు బలమునిచ్చి ప్రాణమును బోసి పోషించి, యంత యెత్తునకు ప్రాణరసమును ఎక్కించవలసిన వగుటవలన భూమిలో లోతుగాఁబ్రాకి నిరంతరము ప్రయాసపడుచు నెదుగుచు విశేషబాధ పడుచున్న వేళ్ల యునికి నైన నెరుగవు. అటువంటి బలమే, అట్లు పోరాడఁగల శక్తియే, నిర్మాణముచేయఁదగు వీర్యము నొసంగెడు శక్తియే, ఆనందసామ్రాజ్యము. పురుషునకు అట్టి బలమును, ఆ బలముతో కలిసి యుల్లాసముకూడఁ గలిగినయెడల, శ్రమపడుటయు ఆ శ్రమతోకూడ జీవితోద్రేకమును గలిగినయెడల, ఆ విధముగా పెరుగుటయు దానితోగూడ పరిపూర్ణరూపసౌష్ఠవమును గలిగినయెడల, —నాపురుషుడు తనలోనే నిత్యసఖు డున్నా డని తెలిసికొనును; ఆ పురుషుడు, తా నెచ్చట నున్నను, తా నెచ్చట నివసించినను, తా నెచ్చట గాలిని బీల్చుచున్నను, ఒంటరిగానుండ డనియును, ఒంటరితనము తన్నెరుగదనియును, తాను ఆనందసామ్రాజ్యమునకుఁ గొనిపోవు

మధ్యమ మార్గమున[1] నుల్లాసముగ బోవుచున్నా డనియును, తెలిసి కొనును. భారతదేశమున శ్రీకృష్ణుని భక్తు లనేకులు ఆతడు తమ సఖుడైయుండవలెనని కోరుటవలన, ఎల్లప్పుడు నాతడు తమతోనుండ వలెనని, తమ హృదయములలో విరతిలేని కాంక్షగలిగి యుండుట వలన, నాతడు తమలో ప్రతియొకరికినిఁగూడ ప్రత్యక్షమగుచుండునని తెలిసికొనిరి; అట్లే ఆ పురుషుడును తెలిసికొనును. శ్రీకృష్ణుడు తన భక్తులకు సఖుడును, వారి యానందమును వారికి మైమరపును అయి యుండెను; మరియును వారి వారి పరిపక్వదశ ననుసరించి, వారి వారి మనోహృదయ వికాసముల ననుసరించి, భిన్నరూపములుగఁ గనపడుచుండెను. భగవంతుడుగాఁ గాని, కేవల మిత్రుడుగాఁ గాని, గొప్పనర్తకుడుగాఁ గాని, సోమరి చెలికాడుగాఁ గాని, మహాస్రష్ట గాఁగాని, దుర్బలుడగు లయకారుడుగాఁ గాని, యెవ రెవ రెట్లు భావించిన, వారి కట్టివాడగుచు, ఎవ రెవరు ఆత డెట్లుండవలెనని కోరిన వారి వారి కట్టివాడగుచు నుండెను. కోరుకొనువారి సంకల్పముల ననుసరించి, కష్టముల ననుభవించి క్రొత్తప్రాణ శక్తినిఁబొందిన వారి హృదయముల ననుసరించి, ఆతని బాహ్యరూపము మారుచుండెను.

ఆనందసామ్రాజ్య స్వరూపుడగు నా పరమపురుషునిఁ గనుగొనఁ బ్రయత్నించుచున్న మన కందరకును గూడ, ఆతడు మన మే రూపమునఁ జూడగోరిన నా రూపమునఁ బ్రత్యక్షమగును; మన మెట్లున్న నాత డట్లుండును; మన మెట్లు చేసిన నాత డట్లగును. అందువలన,

---

1 దేహమును ఇంద్రియములను క్షోభపెట్టుటయునుగాక, కేవలము ఐహికసుఖలోలుడును గాక, దేహేంద్రియమనంబులఁ జక్కఁగ నియమించుకొని, నిష్కామముగ లోకసంగ్రహకర్మరూప మగు కైంకర్యము నొనరించు పరమార్థ కర్మయోగమార్గము. జనకచక్రవర్తి యిట్టి మధ్యమమార్గమునకు నిదర్శనము.

మనకు ఆయనతో నుండవలయు నను కాంక్ష, కోరిక, యున్నంత వరకు, ఆయనను తెలిసికొని, ఆయనను పూజించవలయు నను కోరిక యున్నంతవరకు, మన పురోవృద్ధి యేస్థితిలోనున్నను నొక్కటే. జీవితమునం దిది యొక్కటియే ముఖ్య మగు సత్యము. ఆయన సర్వ భూత స్వరూపుడు. ఈ శుద్ధసత్యముయొక్క తత్త్వము హృద్గతము చేసికొన్న యెడల, ఆయనతోకూడ నిత్యముగ నుండఁగలము. అయితే మనమా నిత్యుని స్వరూపమును స్వయముగఁ గల్పించుకొనుట కొక యుద్యానమును గాంచువరకును, మనకా తీవ్రకాంక్ష, ఆ తీవ్ర తాపము, ఉండవలయును.

ఇదివరకు కొన్ని మాసములనుండి నే నాయనను అన్నివస్తువులలోను వెతుకుచుంటిని. ఆయనద్వారా అన్నివస్తువులను జూడవలె నని కోరు చుంటిని; నాకం డ్లాయనకండ్లై, చిన్నవియు పెద్దవియు, బ్రతికి నవియు చచ్చినవియు, అన్ని వస్తువులును, ఆయనద్వారా చూడవలె నని కోరుచుంటిని. ఆ కోరిక నాయందు గాఢతర మగుచుండెను. ఆ కోరిక నాకు ప్రాణప్రాయమాయెను. ప్రాచీన భారతీయు లనేకులు, లోకములో నింకను ననేకులు, సత్యమును దెలిసికొన నిజముగఁగోరు వారై, నిజముగ నన్వేషించి, కష్టములను పడి ఆయనను కనుగొన్నట్లే నేనును కనుగొంటిని. అప్పటినుండియు నేను బహు పుష్పసమన్వి తమును, వివిధసుగంధపూరితము నగు నాయుద్యానములోనే నివసించి యున్నాను. ఉత్సాహపూరితుడనై, యాసుగంధ వాయువును బీల్చి తిని. నాకు అభివృద్ధిని, శక్తిని ఇచ్చునదియును, నా మనస్సునకు, నా హృదయమునకు, నా జన్మమునకు, బలము, పుష్టి కలిగించునది యును, నగు వాయువు అది యొకటియే. అట్టి బలము గలిగియున్నాను గనుక దానిని ఇతరులకీయకుండ దాచుకొనఁజాలను.

కొద్దిరోజులక్రిందట నొకనాడు నేను షికాగుపోతిని. నేను నడచు చున్నంత సేపును నా నిత్యసఖునితోఁగూడ నడచుచుంటిని. కొంత సేపు అట్లు నడచి యొకచెట్టుక్రిందఁ గూర్చుంటిని. అప్పు డాయొక్క విషయము ననుసరించియేగాని, మరిదేనినినుసరించియును నా కాలో చనయే లేదు. నేను ఎదుటఁజూడగా ఆయన నా యెదుటనే కూర్చొనియుండెను. అప్పుడు ప్రకృతియంతయు ఆయన నెట్లు పూజిం చునో చూచితిని. పెద్దచెట్లు, చిన్న చిన్నగడ్డిపరకలు, వీచుచున్న గాలి, అన్నియును ఆయనను పూజించుచుండెను. నేను అట్లు చూడఁ జూడ, నా యాత్మకు సంతోషాతిశయముతో బలముగలిగి శరీరము పులకరించెను. నాకు మెలుకువగలిగి చూచుసరికి నేను ఆయనవలెనే యుంటిని. మా యిరువురకును భేద మించుకయును ఉండలేదు. నేను ఆయనలో నొకభాగము నైతిని. ఆయనకంటె భిన్నమగు మరియొక వ్యక్తి యున్నట్లు గుర్తించఁజాలకుంటిని. ఆ నిత్యవస్తువునుండి నేను వేరు గాఁజాలకుంటిని. అప్పుడు ఆయన పీల్చు వాయువునే నేనును పీల్చుచు, ఆ యానంద సామ్రాజ్యములో నివసించి, యచ్చట నీడలలో క్రీడించుట యన నేమో తెలిసికొంటిని; మార్గమందున్న పువ్వములను, ఇతర బాటసారులను, జూచుట యన నేమో తెలిసికొంటిని. ప్రతి వస్తువును, ఆయనలో నొక భాగమై యుండెను. అన్వేషించువారు, దుఃఖముల నొందువారు, సుఖ మనుభవించువారు, అందరును శాశ్వత ముగ ఆయన వారే. నేను ఆయనలోఁ జేరియుండుటవలన, నాకు సత్యము తెలిసినది. అందువలన, సత్యమును దెలిసికొనవలె నను మహ త్కాంక్షగలవా రందరమును, ఆ సత్యస్వరూపుడు లేకయే మనకు సత్యము దొరకదనియు, ఆత్మనిగ్రహము గలుగదనియు, తెలిసికొని యుండవలెను. ఆయన నెల్లపుడును హృదయస్థానమం దుంచుకొన

వలెను. అప్పుడే మంటనుండి వెడలు మిణుగురులవలె, మన మా కేంద్ర స్థానమునుండి, వెడలి నలుదెసలకును బోఁగలము.

నేను అట్టి స్థితిలోనుండగా—ఆ స్థితి యంత యెక్కుడు విశేషమైనదికాదు; అసాధారణమైనదియుఁగాదు; ప్రకృతికి మించినదియు గాదు—నేను ఆ పరమసంతోషాతిశయమున నుండగా, నాకును ఆనంద సామ్రాజ్యమునకును మధ్య నాటంకము లేవియు లేవని కనుగొంటిని: ఆ పరమపవిత్రనిలయమును మరుగుపరచు తెరల నన్నిటిని తీసివైచితిని; ఆ యుద్యానమునఁ బ్రవేశించి ఆ మూర్తిని, ఆ పరిపూర్ణుని మరుగుపరచి వికారముగఁజేసి ఆచ్ఛాదించు ముసుగుల నన్నిటిని ప్రక్కకు తొలగించివైచితిని. మీరు నన్ననుసరించఁ గోరినయెడల—అనుసరించుట యనగా గ్రుడ్డితనముగాఁగాదని తెలిసికొని యనుసరించినయెడల—మన మందరమును గలసి తోడుగ సఖులమైపోదము రండు. సుమనోజ్ఞమగు నా యుద్యానమునందలి దివ్యదర్శనమును, ఆ యానందసామ్రాజ్యమును, నిత్యతగల నిలయమును, పరమపవిత్ర గర్భగృహమున్న యా యాలయమును, మీకు కనపరచెదను. కాని, చూచుటకు మీకు కన్నులుండవలెను; మీ మనస్సు పక్వమై సంస్కృతమై గొప్ప తీర్మానములను జేయఁగలదియై యుండవలెను; మీ హృదయములు, ఆటంకములను, భేదములను, పక్షపాతములను ఎరుంగని విశాలమగు ప్రేమతో, మమత్వము లేని ప్రేమతో, నిండియుండవలెను. మీకు పనిచేయుటకు బలముగావలెను. పెద్ద యడుగు వేయుటకుగాని చిన్నయడుగు వేయుటకుగాని బలము గావలెను; మహోన్నత పర్వతములపై కెక్కుటకుగాని, ఉష్ణప్రదేశములయందు నడచుటకుగాని బలము గావలెను. మీ యాత్మ దుర్విషయముల యాకర్షణల నెదిరించుటకు సిద్ధపడియుండవలెను; భయకారణము లనేకము లుండవలెను; సంతుష్టి యుండరాదు; అన్నిటికంటె నెక్కుడగ, ఆ యుద్యానవన జీవితశోభను

గ్రహించుటకై విస్తారమగు ననుభవమువలనఁ గలుగు గొప్పతనము గలిగి యుండవలయును. మీరు నావెంట ఆ యుద్యానమున కేతెంతు రేని, ఆ యుద్యానములో సత్యమును వెతుకుదురేని, స్వచ్ఛమైన సత్యమును అతిపరిశుద్ధమును, అతిమధురమును, అత్యుత్తమమునగు దేవతల యమృతమును గనుగొందురు. ఇది యొక్కటి యే సత్యము, మీరు పూజచేయవలసిన వేదిక యిది యొక్కటియే; సర్వమున కిది యే పర్యవసానము.

శుద్ధసత్యము విస్తారమగు అనుభవమువలననే లభించును; ప్రేమాతిశయమువలనను తీవ్రభక్తివలనను కూడ లభించును. ఎండవానలనుండి, ప్రయత్నములనుండి, సుఖదుఃఖములనుండి, కాపాడుకొనుట కది యొక్కటి యే ఆశ్రయము. దాని నొక్కసారి నీవు చూచినయెడల, నిక సందేహించుటగాని, సంకోచించుటగాని, యుండదు. అప్పుడు నీవే పరమగురువ వగుదువు. వేనవేలకు ఆదర్శమూర్తివి అగుదువు. సహాయుడవు నగుదువు; అప్పుడు చీకటిలో తడుములాడుచున్నవారి కందరకును నీవు దిక్కుఁజూపు స్తంభమువంటివాడ వగుదువు; ఆనంద సామ్రాజ్యమునకుఁ గొనిపోవు నిత్యశాంతిమార్గమున మనము గలిసి నడువఁగలిగిన యెడల, ఎడబాటు, ఒంటరిపాటు, ఉండవు; పరిపూర్ణతయు జ్ఞానప్రాప్తియునగు సిద్ధికలుగుటకు సందేహము లేదు; ఏలయన, అప్పుడు మీలో ప్రతివాడును వెదకుచున్న వస్తువులన్నియు మీ యందు మూర్తీభవించినవార లగుదురు. మీరు ఆ మార్గమునఁ బోయి యా యుద్యానములోఁ గ్రీడించినప్పుడు, అందలి నీడలలో సూర్యరశ్మి దగులకుండ దాగినప్పుడు, మన మందరమును మిత్రుల మగుదుము; మన మందరమును నిత్యసఖుల మగుదుము; మన మందరమును ఆ పరమ పవిత్రుని స్వరూపమును అనుసరించి సృష్టించుచుందుము. ఒక్కసారి మీరు ఆ యమృతమును, ఆ జీవామృతమును గ్రోలియున్న యెడల, నది

మిమ్ములను నిత్యయౌవనమునం దుంచును. ఏలయన మీ రనేకానుభవములను అనుభవించినను, గొప్పకష్టములను భరించినను, విస్తారముగ కన్నీళ్లుగార్చినను, మిమ్ము నిత్యముగ యువకులుగను, సుఖులుగను, పరిపూర్ణులుగను, నుంచునదియును, ఎల్లప్పుడును ఉబుకుచుండునదియు నగు నీటిబుగ్గ చీకటిరాత్రిలో నర్తనముచేయు నక్షత్రమువలె, మీ లోపలనే యుండును. ఏలయన మీకంతయుఁ దెలియును; సత్యమును నాశనము చేయునదియు, సత్యమును తలక్రిందుచేయునదియునగు భిన్నాత్మ నశించినది.

కనుక, మీరు నన్ననుసరించఁ గోరుదురేని, మీరందరును ఆ నిత్యయుద్యానమునఁ బ్రవేశించుట కాటంకముగనున్న ద్వారముచెంతకుఁ బోవలయును; అచ్చట మీ కనేక బీగములు కనబడును; మీలో నొక్కొక్క రొక్కొక్క బీగమును దీసికొని, యా ద్వారమునుఁదెరచి, లోనికేగవచ్చును. కాని ఆనందసామ్రాజ్యమున బ్రవేశించుటకు విస్తారమగు సంతోషము, విస్తారమగు నుల్లాసము, గలిగియుండవలయును. అప్పుడు మీరు పరమగురువులనియు, మీకు జననమరణ చక్రమాగి పోయినదనియు, మీకుఁ దెలియును. అచ్చట మీకు నిత్యమగు నాశ్రయము, నిత్యమగు సత్యము లభించును; అచ్చట భిన్నాత్మభావము పోవును; అచ్చట మీరు క్రొత్తప్రపంచములను, క్రొత్తసామ్రాజ్యములను, ఇతరులకొరకు క్రొత్తనిలయములను నిర్మింతురు.

ఓం శాంతిః, శాంతిః, శాంతిః.

---

Printed by A. K. Sitarama Shastri, at the Vasanta Press,
Adyar, Madras.